# లోధ్ర-ప్రశంస

ఎన్ని మందులనో తింటి నీయిహమ్ము
నంగఁ జీనమ్ము వమ్మని కొందలమ్మ
నందకుము; నేఁడె గల్గు శ్రేయమ్ము నమ్ము
అమృత సమమౌను జుమ్ము లోధ్రౌషధమ్ము



స్త్రీల గర్భాశయంబులఁ జేరు నట్టి
యెల్ల జాడ్యంబులను హరియించి మిగుల
సౌఖ్యమొసఁగూర్పఁజాలు నౌషధ మొకండు
లోధ్రకంటెను గలదె? ముల్లోకములను

—చదలువాడ నాగరత్నము

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు :

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౯]  31 మే 1947  [సంచిక ౫




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బాంకులపైననే పంపవలెను

# శ్రీ సర్వజిత్ నామ సం॥ జ్యేష్ఠ ఆషాఢ మాసములు.

1947-వ సం॥ జూను నెల

| | | |
|---|---|---|
| 1 | ఆ | త్ర 38.9 స్వా 23.44 వరీ 55.12 కౌల 17.33 రా 8.15 |
| 2 | సో | చతు 39.56 వి 27.20 శివ 54.38 గర 9.3 రా 7.35 కంచి గరుడోత్సవము. |
| 3 | మం | ○ పౌ 43.32 అనూ 32.8 సిద్ధ 54.56 భద్ర 11.44 దా 16.29 జ్యే పూర్ణిమ. |
| 4 | బు | బ పా 47.8 జ్యే 37.32 సాధ్య 55.56 బాల 15.19 [చంద్రగ్రహణం |
| 5 | గు | వి 51.57 మూ 43.32 శుభ 57.18 తైతు 19.32 రా 7.45 దివి 0.16 |
| 6 | శు | త 57.28 పూషా 49.40 శుభ్ర 58.53 వణి 24.42 దివి 10.30 కంచి వరదరాజ |
| 7 | శ | చ 60.0 ఉషా 56.6 బ్రా 60.0 బవ 29.44 ది 12.7 [స్వామి రథోత్సవము |
| 8 | ఆ | చ 2.6 శ్రవ 60.0 బ్రా 0.21 బాల 2.6 ది 7.5 |
| 9 | సో | పం 6.19 శ్రవ 2.6 ఇంద్ర 1.31 తైతు 6.19 12.4 |
| 10 | మం | ష 9.54 ధని 7.39 వైద్ర 1.52 వణి 9.56 ది 26.12 |
| 11 | బు | స 12.18 శంత 11.42 విష్క 1.33 బవ 12.18 ది 28.26 |
| 12 | గు | అ 12.54 పూ. భా 14.42 ప్రీ 0.13 కౌల 12.54 రా 7.43 |
| 13 | శు | న 12.51 ఉ. భా 16.27 సౌభా 58.41 గర 12.51 రా 15.39 |
| 14 | శ | ద 12.15 రేవ 17.3 శోభా 50.41 భద్ర 12.15 |
| 15 | ఆ | ఏ 9.51 అశ్వ 15.57 అతి 42.31 బాల 9.56 దివి 8.51 |
| 16 | సో | ద్వా 6.15 భ 14.3 సుక 39.1 తైతు 6.15 రా 13.32 |
| 17 | మం | త్ర 2.3 చతు 55.12 కృ 11.39 ధృతి 32.28 వణి 2.3 ది 20.12 |
| 18 | బు | ● అమా 21.18 రో 8.6 శూల 22.31 చతు 23.20 ది 24.13 తిరువళ్లూరు [వరదరాజస్వామి తెప్పోత్సవము |

## ఆషాఢ మాసము.

| | | |
|---|---|---|
| 19 | గు | శు పా 45.15 మృ 4.47 గండ 18.8 30 18.17 ది 26.43 |
| 20 | శు | వి 39.15 ఆ 0.53 వృద్ధి 10.41 బా 12.15 ది 30.30 |
| 21 | శ | త 33.15 పుష్య 52.27 ధృవ 3.4 తైతు 6.15 ది 16.29 |
| 22 | ఆ | చ 27.15 ఆశ్రే 48.51 హర్ష 48.282 వణి 0.16 ది 23.21 |
| 23 | సో | పం 21.18 మఖ 45.18 వజ్ర 41.43 బాల 21.18 ది 17.44 స్కంద పంచమి. |
| 24 | మం | ష 15.51 పుబ్బ 42.57 సిద్ధి 35.58 తైతు 15.57 ది 5.4 కుమారషష్ఠ వ్రతము. |
| 25 | బు | స 12.15 ఉత్త 41.3 వ్యతి 30.3 వణి 12.15 ది 2.40 |
| 26 | గు | అ 9.15 హస్త 40.27 వరీ 25.23 బవ 9.15 ది 2.40 |
| 27 | శు | న 6.51 చిత్త 41.3 పరీ 21.41 కౌల 6.67 రా 24.39 |
| 28 | శ | ద 5.39 స్వా 42 57 శివ 18.56 గర 5.29 రా 26.59 లక్షవ్రతా రాంభము. |
| 29 | ఆ | ఏ 6.51 వి 45.57 బద్ధ 17.38 భద్ర 6.51 రా 26.7 విష్ణు శయనోత్సవం. |
| 30 | సో | ద్వా 8.39 అ 50.3 సాధ్య 16.41 బాల 5.39 తిరువళ్లికేణి రథోత్సవం. |

# విషయసూచిక.


| | |
|---|---|
| జనాభా సమస్య | 229 |
| 'గృహలక్ష్మి' స్వర్ణకంకణము | 232 |
| నా చిన్ననాటి ముచ్చట్లు | 233 |
| తువ్వాయి జ్వరం | 237 |
| కృష్ణాపత్రిక - వడగళ్లు | 242 |
| పాకకళ | 245 |
| ఇంటిపనులలో మెళకువలు | 248 |
| గృహవైద్యము: నిమ్మకాయ | 250 |
| బ్రతుకు తెరువు | 252 |
| పిరికిమందు | 253 |
| ఆంధ్ర వీరపత్ని | 255 |
| శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి షష్టిపూర్తి | 256 |
| ప్రతిఫలం | 257 |
| స్త్రీల వాఙ్మయం | 258 |
| కూచిపూడివారి ఆహార్యం | 259 |
| 'వీట్ నామ్' స్త్రీల త్యాగము | 261 |
| బాతాఖానీ | 264 |
| రాట్న ప్రశంస | 266 |
| సోవియట్ శిశురక్షణాలయాలు | 267 |
| గిరిజ | 269 |
| చిత్రప్రశ్నలకు జవాబు | 275 |
| కీ॥ శే॥ శ్రీమతి ముడుంబ వెంకటమ్మగారు | 276 |
| వైజ్ఞానిక విశేషాలు | 278 |
| శ్రీ కాశేశ్వరరావు పంతులుగారి కొత్తబిల్లు | 279 |
| బాలవిజ్ఞానం | 281 |
| లోకవార్తలు | 282 |
| పుష్పాపచయము | 283 |
| సంపాదకీయములు | 284 |
| స్వీకారము | 285 |


త్రివర్ణ చిత్రము: వనవాసము.

చిత్రకారులు: ఎ. ఆర్. దీనన్‌గారు.



చేతం జాపము, మేన వల్కలములున్, శీర్షంబునందుం జడల్, సీతాలక్ష్మణు లుండ ముందు వెనుకన్, జెల్లింపఁ బిత్రాజ్ఞ, దుర్దైతేయోగ్రమృగేంద్రకంటకభయస్థానాటవిన్, వీతశంకాతంకస్థితి సంచరించితివి; రామా ! యార్తరక్షామణీ.

—వ॥ సు॥ రాయకవి.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యా ప్రబోధ! జయ కల్యాణీ!

---

# జనాభా సమస్య.

భారతదేశంలో జనాభా నానాటికీ మితిమీరి వృద్ధిఅవుతున్నదనీ, మన ఆర్థిక, సాంఘిక, ఆరోగ్యాది పరిస్థితులనుబట్టి సంతాన నిరోధము అవసరమనీ కొందరు వాదిస్తూ ఉంటారు.

సంతానం కనిపెంచడానికి అని ఈశ్వరునిచే సృష్టింపబడిన ఏ స్త్రీయున్నూ - తాను గొడ్రాలిగా ఉండవలెనని కోరదు. అంతకూమించి, ఈశ్వరుడు ప్రసాదించిన సంతానాన్ని నిరోధించవలెనని మొదలే కోరదు. అయితే నిజంగా మన దేశంలో జనాభా మితిమీరి హెచ్చిపోతున్నదా, ఆర్థికాది కారణములవల్ల నిరోధించడం న్యాయ సమ్మతమా, సంతాన వృద్ధివల్ల కష్టములు కలిగించే కారణాలు ఏవన్నా ఉన్నాయా, ఉంటే వాటిని తొలగదోసుకోవడానికి ఉపాయాలు లేవా, అని మనము విమర్శపూర్వకంగా ఆలోచించడం అవసరము. హృదయ దౌర్బల్యంతో కేవలం గుడ్డిగా 'గతాను గతికోలోకః' అన్నట్లు నడువరాదు.

నేడు మన జనాభా 40 కోట్ల పరిమితి నందుకున్నది. మన జనాభాకన్న హెచ్చు సంఖ్యకలది ఒక్క చీనామాత్రమే. అదిన్నీ - గత 1931 లెఖ్ఖలనాటికి 1921 నుండి అభివృద్ధి 100 కి 10. 6 మాత్రమే కాగా 1931 నుండి 1941 నాటికి ఆదామాషా 15. 1 అయినది.

1911-21 మధ్య అభివృద్ధి 100 కి 1 కంటే హెచ్చు కాదు. అందుచేతనే కాబోలు, పిదప భారత దేశంలో జనాభా మితిమీరి పోతున్నది అని గోలపుట్టినది. నిజానికి మన దేశంలో జనాభా అభివృద్ధి ఇతర దేశాలకంటె హెచ్చుకాదుగదా, చాలా తక్కువకూడా. 1871-1931 మధ్య లెక్కచూస్తే మొత్తంఅయిన అభివృద్ధి అంతా 100 కి 30 వంతులే. ఇదే కాలంలో ఇంగ్లాండు వేల్సులలో 100 కి 77 వంతులు వృద్ధి అయినది. ఫ్రాన్సులో ఈ దామాషా ఇంగ్లాండుకన్న తక్కువగాని, అమెరికా సంయుక్త రాష్ట్రములలో ఇంకా హెచ్చు. మరోవిధంగా లెక్కచూతాము. గత 70 సం॥ల లో దామాషామీద సాలీనా అభివృద్ధి మన దేశంలో 100 కి 0. 7 మాత్రమే, పదేసి సం॥లకు 100 కి 6. 5 మాత్రమే, వృద్ధి. కాబట్టి - ఇంగ్లాండు మొదలైన దేశాలలో - స్త్రీకి మనవారికన్న సంతాన యోగ్యత తక్కువగాదు. వింతనాగరికతవల్ల, విపరీతపు ఆర్థికసిద్ధాంతముల మూలమున - వారు ఇటీవల కృత్రిమసాధనోపాయములచే సంతాన నిరోధము నవలంబించినారు. తోక తెగిన నక్కలవలె, మనము దాని నవలంబింపవలెనంటారు.

ఆయాకారణాలచేత యూరపియన్ దేశాలలో జనాభా తగ్గిపోయినది. అయితే యుద్ధకాలంలోనూ, యుద్ధం తర్వాతనున్నూ దీని దుష్టఫలితాలు బాగా అనుభవిస్తున్నారు. యుద్ధకాలంలో, మందీ మార్బలము కొరతపడ్డది. యుద్ధం తర్వాత శాంతిపరిస్థితులు రావడానికి తగిన పారిశ్రామికాభివృద్ధికై కావలసిన జనానికై తట్టిముట్టాడవలసి వచ్చుచున్నది. మానవశక్తి అవసరము క్లుప్తమగునట్లు యాంత్రికశక్తి నభివృద్ధి పరుచుకొన్నను, ఆ యంత్రములను నడుపుటకైన మనుష్యబలము మందగించింది. నేడు లంకషైరులో - వస్త్రోత్పత్తి మందగించుటకు ముఖ్య కారణములలో, మనుష్యబలము తక్కువగుటకూడా ఒక్కటి అని వింటున్నాము.

కావున మనలను హడలు గొట్టునది, నిజముగా హడలు కొట్టవలసినది - జనాభా అభివృద్ధికాదు. ఆర్థిక, సాంఘిక, పారిశ్రామిక ఆరోగ్యాది ఇతర విషయములు.

మన ఆరోగ్య పరిస్థితులు అధ్వాన్నముగా నున్నవి. న్యూజిలాండు 65, ఆస్ట్రేలియా 76, ఇంగ్లాండు జర్మనీలు 63, అమెరికా 59, జపాను 47, సంవత్సరములు క్రమంగా మానవ, జీవిత పరిమాణములుకాగా భారత దేశమున 27 సం॥ లే. శిశుమరణములు ఇతర దేశముల

నెక్కడను 1000 కి 100 కి లోపే. కాని మనదేశమునను 162. ఈ దేశమున నిరంతరము ఏమూలనో ఒకమూల విషూచి, మశూచి, ప్లేగు, మలేరియా మున్నగు వ్యాధులు తాండవమాడుతున్నవి. కుష్టు, క్షయ మున్నగు వ్యాధులు బాగుగా వ్యాపించిఉన్నవి. బ్రిటన్‌లో ప్రతి 1000 మందికి ఒక్కడాక్టరుండగా మన దేశాన ప్రతి 9000 కు ఒక్క డాక్టరే. మన దేశంలో జనము 100 కి 90 మంది గ్రామముల నివసిస్తున్నారు. కాని 100 కి 90 మంది డాక్టర్లు పట్నాలు పట్టుకొని వ్రేలాడుతున్నారు. సాంఘికముగా మన దేశమున మూఢాచారములు, విశ్వాసములు రాజ్యము చేస్తున్నవి. ప్రతి జాడ్యమును ఏదో దేవత కన్వయం. వ్యాధి నివారణకై, అందు ముఖ్యముగా శిశువ్యాధుల విషయమై రక్షరేకులను, తాయతులను, విభూతి తీర్థాలను, దీపాలు దిగదుడుపులను, మంత్ర తంత్రాలను ఆశ్రయించినంతగా, ఆరోగ్య విధులను, డాక్టర్లను, ఔషధ చికిత్సలను - ఆశ్రయింపరు. ఆర్థికముగా సామాన్య పరిస్థితులలో 100 కి 30 మందికి పూర్తిగా రెండుపూటల తిండిలేదు; ఆతినే ఆహారమును పుష్టికరముకాదు. విద్యావంతులు 100 కి 11 ½ కంటె ఎక్కువ లేరు. పారిశ్రామికముగను మనము చాల వెనుకబడి యున్నాము. వ్యవసాయము మనకు ముఖ్యవృత్తియైనను చాలినంత తిండి పండించుకో లేకున్నాము. ప్రపంచమున కంతటికి వస్త్రనిర్మాణమును నేర్పిన వారమైనా, చాలినంత గుడ్డను ఉత్పత్తిచేసుకో లేకున్నాము. 4 కోట్ల జనాభా గల ఇంగ్లాండు మనకింకను 8 కోట్ల పౌనుల తయారైన వస్తు సామగ్రి పంపుచుండగా 40 కోట్లమందిమి ఉండీన్ని కొని అనుభవిస్తున్నాము. కావున వివేకముతో, శ్రద్ధతో, దీక్షతో, శ్రమతో కృషిచేసి మనమీ స్థితిగతులు మార్చుకోవలసియున్నది. నాడు మన జనాభా అభివృద్ధి ఘనకు వరప్రసాదము అగునుగాని కంటకము కాజాలదు. కాళ్లుపొడవైన మంచము పెద్దది చేసుకొనుట వివేకముగాని, మంచము పొట్టియని కాళ్లు తెగకొట్టుకొనుట అవివేకముగదా.

అయితే ఈ బాధ్యతలో విస్తారము - 100 కి 90 పాళ్లు అనవచ్చును - రాజకీయ వేత్తపై లేదు. పారిశ్రామికునిచేతిలో లేదు. విద్యావ్యాపకునిదీగాదు. ఆరోగ్యమంత్రి దంత కన్నా కాదు. బిడ్డలకని, పెంచవలసిన తల్లియైన ఇల్లాలిది; ఇల్లాలిది! ఆమె విద్యావంతురాలై ఇంటిపనులలో మెళకువలు తెలిసి, ఇల్లు చక్కదిద్దుకోవలెను. గృహవైద్య రహస్యము నెరింగి, తానారోగ్యవంతురాలై భర్త, బిడ్డల ఆరోగ్యము కాపాడవలయును. బ్రతుకు తెరువు బట్టి-తనయింట ఆర్థికపరిస్థితులను, దేశీయ పారిశ్రామిక సమస్యను చక్కచేయ వలయును. వీర్యవంతులు, విద్యావంతులు, ధీమంతులు, పనిమంతులు, భాగ్యవంతులు, నైన సంతానమును కని, పెంచి, భారత దేశమున జనాభా అభివృద్ధి భారత దేశమునకుగాని, ప్రపంచమునకు గాని బరువు చేటుగాదు అనే మాట పుట్టింపవలెను.

—:o:—

# ★ గృహలక్ష్మీ — స్వర్ణకంకణము. ★

మేము 'గృహలక్ష్మి' పత్రిక నారంభించిన తర్వాత వరుసగా ప్రతిసం|| మున్నొక నారీశిరోమణికి, "గృహలక్ష్మి స్వర్ణకంకణము" ను బహూకరించి ఉత్సవం గావిస్తూ ఉంటిమి. 1942 వసం|| పత్రికతో పాటు నీయుత్సవము నిలిచిపోయెను. నేడు తిరిగి పత్రిక ప్రచురింపబడుచున్నది. కాన గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవమునున్నూ పునరారంభింప దలచితిమి. ఈ మహోత్సవమును - 1948 జనవరిలో జరుపవలెనని మాసంకల్పము.

విద్యావైదుష్యములందు, శాస్త్ర విజ్ఞానములందు, కళలు లలితకళలందు, నేర్పునైపుణ్యములు, కావ్యరచన, నవలా నిర్మాణము నాటకములు, ప్రహసనములు, వ్యాసములు మున్నగాగలవి వ్రాయగల ప్రజ్ఞా సామర్థ్యములు సంఘసేవ దేశసేవగావించిన దీక్షాదక్షతలు - మొదలైనవి, ఈస్వర్ణకంకణమునందుండుటకు అర్హతగా నిదివరకు పాటించితిమి. ఇక పైగూడనట్లే - పాటింతుము. అట్టివారికొరకు మేము సహస్ర విధముల నరసి అందత్యుత్తమురాలని మాకు తోచినవారికి బహూకృతి నొనర్చెదము. అయితే మాకు తెలియక అరుంధతీ దేవివలె ఎందరు స్త్రీరత్నము లుండరు? కావున అట్టివారి నెరిగిన పెద్దలు, సకారణముగా వారిని సిఫారసు చేయగోరుదుము.

మా అన్వేషణమున కొంతవరకు మా "గృహలక్ష్మి" లోని వ్రాతలేమాకు హెచ్చుగా ఉపకరిస్తూ యుండేవి. ఇక్కడ ఒక్కమాట నిష్ఠూరమైన స్పష్టముగా చెప్పవలయును. పూర్వముకన్న ఇప్పుడు రచయితలు ఎక్కువైనమాట వాస్తవమే. కాని పూర్వమువలె ఉదాత్తమైన విషయములనుగూర్చిన ఉత్తమరచనల గావించువారి సంఖ్యమాత్రము మందగించుచున్నదని వ్రాయుటకు చింతిలుచున్నాము. బహుశా ఇటీవల బయల్వెడలిన పిల్లపత్రికలు పాఠకుల అభిరుచులతోపాటు, రచయితల అంతస్తులను కలుష మొనర్చినవేమో! అయినను తగిన సమయముగావున, మేమీ హెచ్చరిక గావింపవలసి వచ్చినది. ఉత్తమ సాంప్రదాయములను, సదాచారములను, గాంభీర్య వర్తనములను, సద్వస్తువులను కాపాడుచు, క్రొత్తవి చేకూర్చ వలసిన విధి "గృహలక్ష్మి" ది. కావున "గృహలక్ష్ములు" తాము రచించుపట్ల మాకోరిక మన్నింతురని భావిస్తున్నాము. సర్వదావారికె మా "గృహలక్ష్మి స్వర్ణకంకణము" ను పొందగల్గుట ఆదర్శముగా నుండుగాకయని వినయపూర్వకముగా మనవిచేయుచున్నాము.

కె. యస్. కేసరి.

—:0:—

# నా చిన్ననాటి ముచ్చట్లు.

కే. యన్. కేసరి.

19-4-47 తేదిన కేసరి హైస్కూలు వార్షికోత్సవమున నాటి కవసరమైన వరకే నాజీవిత వృత్తాంతమును చెప్పియుంటిని. అయితే ఆప్తమిత్రులు-పలువిశేష ఘట్టములతో గూడిన నాజీవిత వృత్తాంతమునందలి మరికొన్ని వివరములు తెలియకోరెదము; వ్రాయించుడని పదేపదే కోరగా, సమ్మతించితిని. మున్ముందుగా, చెన్నపురి రాకముందు జరిగిన 'నాచిన్ననాటి ముచ్చట్లు' ను ఇందు వ్రాయించుచున్నాను. గాంధీమహాత్ముడు మున్నగు మహనీయుల "జీవితచరిత్ర" లవలె నాయదియు ప్రజలకాదర్శ ప్రాయముగా నుండుననే అహంకారముతో నేనిద్దాని నేకరువు పెట్టుటలేదు. నాజీవిత వృత్తాంత ముపకరణముగా సుమారు డెబ్బది సంవత్సరముల పూర్వచరిత్ర నాకు తెలిసినంత వరకు పిదప వారికి తెలియ జెప్పుట నాధర్మమని తలంచి మిత్రులు కోరినంతనే ఇయ్యకొంటిని, అని మనవి చేయుచున్నాను.

## బాల్యము - విద్యాభ్యాసము.

మా తల్లికి నేనొక్కడనే సంతానము. ఆమెతనకు ఆడబిడ్డలులేని ముచ్చట తీర్చుకొనుటకై నాకు ఆడపిల్లవేషమువేసి ఇరుగుపొరుగిండ్లచూపి ఆనందించుట నాకిప్పటికిని జ్ఞాపకమున్నది. నా 5వ ఏటనే మాఅమ్మ నన్ను మా ఊరిలో బడికి చదువ పంపినది. ఆబడి పంతులు పేరు పిచ్చయ్యగారు. వారికి పిల్లకాయలకు చదువుచెప్పగల సామర్థ్యము లేక పోయినను చీటికి మాటికి వారిని చావగొట్టేవారు. అందుచేత వారిని చూస్తే పిల్లకాయ లందరికి చాలా భయముగా ఉండేది. ఆకాలములో బడిపంతుళ్లకు నెలజీతములు లేక నెలకింతని జీతముగానిచ్చుట లేకపోయినను భోజనపదార్థములగు వరిగలను, కాయధాన్యములను, వంకాయలు - గోంగూర - పచ్చిమిరపకాయలు మొదలగు కాయగూరలను, రైతుల పిల్లకాయలు తెచ్చి ఇచ్చేవారు. అందుచే వారు పంతులు దయకు పాత్రులై యుండేవారు. అట్టివారికి దెబ్బలుండవు. ఏమీ తేలేని వారికి మాత్రము, పంతులు బెత్తముతో కావలసినన్ని వేముపండ్లను ప్రసాదించేవారు. బడిలో పిల్లకాయల సంఖ్యానుబట్టి ప్రభుత్వమువారు అప్పటికి కొంత కాలమునుండి, సాలీనా రొఖ రూపమున గ్రాంటు నిచ్చుచుండిరి. ఆసర్కారు గ్రాంటుకై ఆయన తంటాలుపడి పిల్లకాయలను బడికి చేరదీసేవారు.

కొత్తపిల్లకాయలను బడిలోనికి చేర్చేనాడు బడిలో చదివే పిల్లలందరికి పప్పు బెల్లాలు పంచి పెట్టేవారు. పంతులుకు వరహా (4 రూ॥ లు) మామూలైనను అందరు ఇచ్చుకొన గలిగేవారుకారు. అయినను పిల్లకాయల వల్లనే పంతులుకు సంసారము తేలికగా జరిగి పొయ్యేది. పంతులు ఇంటి ముందు వేయబడిన పూరికొట్టములో మాబడి ఉండేది.

ఆకాలమున గుంటఓనమాలు నేర్చుకొని ఆపిమ్మట కొయ్యపలకమీద వ్రాయడ మారంభించే వారము. కొయ్యపలకమీద వ్రాయుటకుముందు నీలిమందు, దోసాకు పసురులు పట్టించి, బాగుగా మెరుగుపెట్టి, ఎండలో పెట్టేవారము. ఆరిన పిదప దానిపై బల పముతో వ్రాయవలసి యుండేది. ఆకాలమున బలపపు కోపులనే మెత్తటి తెల్ల రాళ్లుండేవి. వాటినితెచ్చి రంపముతో సన్నసన్న కోపులుగా కోసివానితో ఆకొయ్య పల కపై వ్రాసుకొనేవారము.

నాలుగైదు సంవత్సరములు ఆబడిలో చదివిన మీదట పెద్దపుస్తకమును (సామా న్యముగా రామాయణము, లేనిచో భారతమో భాగవతమో.) పట్టించుట జరిగేది. సర స్వతిపూజ జరిపి పిల్లవానిచేత రామాణమును పంతులు చదివించేవారు. ఆదినమువ పిల్ల కాయలకు పప్పుబెల్లాలు పంచి బడికి ఆటవిడుపు (శెలవు) ను ఇచ్చేవారు. ఈపెద్దపుస్త కముతో ఆబడిలోని చదువు సమాప్తము. ఆకాలమున పెద్దపుస్తకము పట్టుట పూర్తి అయినచో, ఈకాలమున బి. ఏ. పట్టా పొందుట వంటిది.

నేను పేదవాడిని గనుక పంతులుకు ఏమియు సమర్పించు కోజాలని కారణ మున నాకు దెబ్బలు తప్పచదువు అంతగా అంటలేదు. నేనుబడికి కూడా క్రమముగా పోలేక పోతిని. ఏలననగా మాతల్లికి నేను కొంతసహాయం చేయవలసి ఉండేది. మా ఊరిలో గుండ్లకమ్మ అనేనది కలదు. నేనుతెల్లవారగనే ఏటికి పోయి, కాలకృత్యములు తీర్చుకొని, చిన్నకావడిలో రెండు చిన్నతప్పేలాలు పెట్టుకొని, ఏటిలో నీటిని ఇంటికి తీసు కొని పోయేవాడను. పిమ్మట చద్ది అన్నమును తిని, ఎవరి పొలములవద్దకైనా పోయి వంకా యలను గోంగూర పచ్చిమిరప కాయలను, దోసకాయలు మొదలైన వానిని అడిగి కోసు కొనివచ్చి తల్లికి ఇచ్చేవాడిని. మరి జొన్నకంకులు సొజ్జకంకులను కూడా తెచ్చుకొనే వాడిని.

మాయింటి సమీపముననే ఉప్పలవారి మర్రిచెట్టు అని, యొక పెద్దచెట్టు ఉండెను. అదియిప్పటికిని యున్నది. దాని ఆకులు చాలపెద్దవి. విస్తరాకులు కావలసి నేను ఒకనాడు ఆమర్రియాకులను కోయుటకై చెట్టెక్కితిని. కొంతదూరమెక్కగానే కండ్లుతిరిగినవి. పైకెక్కలేను; క్రిందికి దిగలేను. అట్లనే చెట్టుకావలించుకొని యుంటిని.

పట్టుతప్పినా నే నీపట్టున వ్రాయవలసిన అగత్యముండేదికాదు. దైవవశమున ఇంతలో మరియొకడు ఆకులను కోసుకొనుటకు వచ్చి నాఅవస్థ చూచి నన్ను వాడు మోకుతో క్రిందికి దించెను. అప్పటినుండి నేను చెట్లు ఎక్కడము మాని దోటి కట్టుకొని పోయి దానితో ఆకులను కోసి తెచ్చే వాడను. ఆ ఆకులతో విస్తళ్లను కుట్టేవాడను. జొన్నదంటు ఈనెలను సన్నగా చీల్చి, విస్తళ్లను సన్నగా కుట్టు నేర్పరితనము నాకు ఉండేది. నేనుకుట్టిన విస్తళ్లను చూచిన మిషన్‌కుట్టువలె ఉండేది.

నాతల్లి రవికెలు కుట్టడంలో చాలానేర్పరి. ఊరివారంతా మా అమ్మవద్దకు వచ్చి రవికెలు కుట్టించుకొనేవారు. సాదారవికెలు కుట్టిన ముక్కాలణా; పూలువేసి కుట్టిన ఒక్కణా; తేళ్లు మండ్రగబ్బలు, పక్షులు - వీనిబొమ్మలు వేసికుట్టిన రెండు అణాలు యిచ్చే వారు. ఆకాలమునాటి నాజూకు వస్త్రాలంకారములు, పాలచాయ కోకలు; నల్లచాయ రవికెలు, గువ్వకన్ను, నెమలికన్ను అద్దకము రవికెలు. అట్లతద్దె పండుగ వచ్చినప్పుడు ఆనాటిస్త్రీలు ఈవిధమగు చీరరవికెల ధరించి, కొప్పులనిండ బంతిపూలు తురుముకొని కోలాహలముగా వుయ్యాల. లూగుచుండెడు వారు. అట్టివినోదములు ఈనాటిస్త్రీలకు పరిచయములేవు. అవి జాతీయమగు క్రీడావినోదములు; దేహమునకు చురుకు, పుష్టినిచ్చునవి కూడ. మాతల్లి రవికెలను కుట్టి సంపాదించిన డబ్బు మా భోజనమునకు కొంతవరకు సరిపోయేది.

ఆకాలములో పండుగనాడు, తద్దినమునాడు మాత్రమె వరి అన్నమును తినేవారము. తక్కిన దినములలో జొన్నలు, సజ్జలు, వరిగలు వాడుకొను వారము.

నెయ్యి, వరిబియ్యమును మాత్రము డబ్బిచ్చి కొనేవారము. వంటచెరకునకై మా తల్లి పొలముల చాయ వెళ్లి కందిదుంపలను త్రవ్వి తెచ్చెడిది. కందిమొక్కలను కోయునప్పుడు జానెడు లోపున భూమిపై విడిచి కోయువారు. ఆ విడువబడిన దానిని సమూలము త్రవ్వి తీయుచో-చక్కనివంట చెరుకుగా ఉపయోగ పడేది. తిరుగా పైరువేయుటకు అడ్డములేకుండా ఈదుంపలు తీసివేయ వలయును. పైగా రైతు లటు నిటు పొలములలో తిరుగనప్పుడీదుంపలు పొరబాటున కాలులో గుచ్చుకొన్నచో గాయమై ఒకరాగాన మానదు. అయితే తామే త్రవ్విస్తే కూలిఇవ్వ వలెను. అందుచేత సామాన్య రైతుల ఇంటి ఆడువాండ్లు వచ్చి వారియింటికి వంటచెరకున కవసరమైనన్ని త్రవ్వితీసుకొని పోవుదురు. రైతులున్నూ, పేదవారిని ఉచితముగానే త్రవ్వితీసుకొని పోనిత్తురు. ఈప్రకారం మాతల్లి సం॥నకు చాలినన్ని దుంపలను త్రవ్వి జాగ్రత్త పెట్టేది.

మా ఊళ్లో మాబంధువులు ములుకుట్ల కృష్ణయ్య అనేవారు భిక్షాటనమున, పౌరోహిత్యమున తనజీవితమును గడుపు కొనేవారు. వారు అప్పుడప్పుడు మాఊరికి

సమీపములో ఉండే బసవన్నపాలెమనే చిన్న గ్రామానికి భిక్షమునకు వెళ్లేవారు. నాకు ఉన్న ఊరిలో బిచ్చ మెత్తుకొనుటకు లజ్జగా ఉండేది. అందుచేత కృష్ణయ్యతో కూడా బసవన్నపాలెమునకు జోలెకట్టుకొని భిక్షమునకు పోతిని. నేను చిన్నవాడిని అగుటచేతను, క్రొత్తగా వెళ్లుట చేతను, ఆవూరి అమ్మ లక్క లందరూ నన్ను ప్రేమతో లాలించి కృష్ణయ్యకంటే ఎక్కువగా నాకుబిచ్చము పెట్టినారు. కృష్ణయ్య జోలెకన్న నాది పెద్దదైనది. మోయ జాలనైతిని. అప్పుడు నాఅవస్థచూచి కృష్ణయ్యగారు నామూటను గూడ కొంచముదూరము వారేతీసుకొనిరి. మధ్యాహ్నమునకు ఇంటికి చేరినాము. అప్పుడు మాతల్లి నాజోలె మూటను జూచి సంత సించినది; గాని వెంటనే నాచమటలు, అలసట, ఆయాసము చూచి భోరున ఏడ్చినది. తక్షణమే నన్ను స్నానము చేయించి, కడుపునిండ అన్నము పెట్టి నిద్దుర పొమ్మని ఆమె భోజనమునకు పోయినది. ఆమె భోజనము చేసివచ్చే లోపలనే నేను నిద్రి పోతిని. నాతల్లి నాకాళ్లవైపున కూర్చుండి ఏడ్చుచుండెను. నాకు మెలకువ వచ్చి 'ఎందు కేడ్చెదవమ్మా' అని నేనడుగగా నాకాళ్లలో ముళ్లుగుచ్చుకొని యుండుటను చూపినది. నేను బిక్షా టనమునకై పోయివచ్చిన డొంకన తుమ్మ ముళ్లు విస్తారముగా నాకాలిలో విరిగి యుండెను. వాని నన్నిటిని ఆమె సూదితో మెల్లగా తీసివైచి మరల ఎన్నడు అట్లా భిక్షాటనమునకు పోనని నాచే ప్రమాణము చేయించు కున్నది.

మా ఇంటి యెదుటనే మా మేనమామగారు ములుకుట్ల మహాదేవయ్యగారు నివసించేవారు. కాని వారిసహాయము మాకు ఏమీలేకుండెను. మా మామగారు ధర్మరాజు వంటివారు. మా అత్తగారు మాత్రము గయ్యాళి గంప. వారిధాటికి మామామగారే గాక ఊరివారంతా భయపడే వారు. ఆమె అమిత జగడాల మనిషి. ఎవరినైనా తిట్టదలుచుకుంటే తిట్టిన తిట్టు మరల తిట్టకుండా రెండు మూడుగంటల కాలము తిట్టగల శక్తి ఆమెకు గలదు. అందు వల్ల ఆమెను చూచిన యింటివారికి వెలుపలి వారికి కూడా అమిత భయము. ఈ కారణమున మా మేనమామ మాకు సహాయ మొనర్ప జాలకుండెను. (అయితే శ్రీ కేసరి గారు స్థితి మంతులైనపిదప ఆ మేనమామగారిని, వారి సంతతిని ఆదరించినారు. ఆ మహాదేవయ్య మనమడు మహాదేవయ్యను, తండ్రిలేని బాలుని దగ్గర దీసి, చదువు చెప్పించి, వివాహమొనర్చి, తనవద్దనే ఉద్యోగ మిచ్చి నిలిపినారు. వారే ఇప్పుడు కేసరీ కుటీరమున పని చేయుచున్న శ్రీమహాదేవన్ గారు. ........లేఖరి)

ఈవిధముగా సమీప బంధువుల సహాయములేక, స్వయం శక్తిచే సంపాదించి తాను వంటిపూట భుజించి, నాకు వీలు వెంట రెండు మూడు పూటలు అన్నము పెట్టుచు నాతల్లి నన్ను కంటికి రెప్పవలె పోషించు చుండెను. అప్పుడామె కష్టమును చూడ లేక ఆమెతో చెప్ప కుండానే మాఊరినుంచీ కాలినడకన మద్రాసునకు చేరినాను. ఆపిదప కథ వెనుకటిసంచికలో మీరు చదివియే యున్నారు.

——(o)——

# తువ్వాయి జ్వరం

"అమ్మా! బుజ్జమ్మ నాదే."

... ... ...

మాఘమాసం ఫుండువంటిచలి కరిచేస్తున్నది. పెద్దావుకు బుజ్జి పెయ్యదూడ పుట్టిందని వాళ్ళమ్మ ప్రొద్దున్నే మరువుతెరువుల నిద్రలో చెప్పేసరికి చిలక పక్కమీదినుంచి ఎగిరి ఒక్కగంతేసి పరుగెత్తిపోయి, గమ్మున బుజ్జిదూడ మెడగావిలించుకొన్నది; "అమ్మా! బుజ్జమ్మనాదే" అన్నది. నిద్రలో చెదిరిన తలవెండ్రుకలు సర్దనివ్వాలేదు. వీడిపోయినపావడా బిగించనివ్వాలేదు. చలికి అరికంతమైనా కట్టించుకోలేదు. మొగమంతా అయిన కండ్లకాటుకతో, నిద్రరాకముసుపే ప్రమింగగా మిగిలిన తాంబూలపు శకలాలంటిన పెదవులతో-(నిద్రకు ముందు వచ్చిన కోపానపెట్టిన బుడ్డమూతి బిగువైనా ఇంకావదలలేదు!) ఆ రేండ్లపిల్లా, చిలక, పోయి, రెండుచేతులూ దూడమెడకు చుట్టివేసింది. ఇంకా ఆవు తన బిడ్డను నాలుగుమూలల నాకనైనా నాకలేదు. ఈనినపసరం తన దూడను తాకితే బిడ్డను పొడుస్తుందేమోనని-వెంకమ్మ వెంటనేవచ్చి "సరే, నీదేలే, అమ్మా" అనిచెప్తూ తిన్నగా తనకూతురిని ఇవతలకి తీసుకొని వచ్చింది.

... ... ...

చిలకమ్మ అన్నిటా చిలకే. ఆపలుకులు, ఆకులుకులు, ఆతళుకులు, ఆబెళుకులు, ఆనవ్వులు, ఆచిందులు అన్నిటా చిలకే. ఎర్రగా దుత్తువలె పిల్లా; మోచేతులవరకు నల్లగాజులూ; కండ్లనిండా కాటుకా; ఎప్పుడూ ముప్పొద్దు అమ్మతోపాటు తాంబులచర్వణం; నిరంతరం నోటినిండా తాంబూలము రుబ్బుతుంటే, పొట్టమీద జారిన ఎర్రనిచారలు; ఆవీధినిపోయే వారంతా, ఎంత తొందరపనిమీద పోతున్నా సరే-చిలకను పలకరించకుండా పోరు. అందులోనూ 5 గురు కొడుకుల తర్వాత పుట్టిన ఒక్క ఆడపిల్ల, తల్లిదండ్రులకేగాక, బంధుజాలానికంతా ఆపిల్లంటే ముద్దుమురిపెమూ. ప్రక్కనున్న నిడమానూరు నుంచి వెంకట స్వామిబావ పొలిమేరచేనికి వచ్చినప్పుడెల్లా, పనికట్టుకొనివచ్చి చిలకను చూచిపోతాడు. బావదగ్గరచేరి బుగ్గలు బుసబుసలాడుతుంటే పెద్దనాపసానివలె, అమ్మమీద నేరాలు, అన్నయ్యల మీద నేరాలు, వదినలమీద నేరాలు ఎన్నో చెప్పేది. వింటూ-వింటూ, ఆబావ చిలక లక్కపిడతనోట్లో ఎన్నిముద్దులు కుమ్మరించేవాడో!

... ... ...

"బుజ్జాయి" మీదప్రేమ అదిపుట్టిననాడే దానితల్లి ఆవూ, చిలకా సరిసమానంగా పంచుకొన్నారు. పాలుతరిగి, ఎడలేర్పడుతూ, నిలిచేసరికి క్రమంగా దానికి తల్లితో ప్రేమబంధాలు సడిలినవి కాని చిలకమ్మతో మాత్రం పెనవేసుకున్నవి. చిలకమ్మ దానికి "మాలచ్చిమి" అని పేరు పెట్టుకున్నది. కమ్మటి తల్లిపాలు త్రాగేదూడను మెడకావలేసుకొని లాక్కొచ్చి పచ్చని జొన్నపిలకలు చేతితో నోటి కందించేది, దూడ ఎదిగేకొద్దీ, గవ్వలు కట్టింది; మువ్వలు కట్టింది. పట్టెడవేసి గంటకట్టింది. తనకు వెక్కసమైనదని గిన్నెడు పెరుగన్నము 'బుజ్జాయి'కి పెట్టి-ఇంకా కాస్త సేపటికి "అమ్మా ఆకలి అవుతున్నదే"

అని బిక్క మొగము పెట్టుకొని అడిగేది. క్రమంగా దూడలలో-కోడెలలో కలియదిరిగి, చేలల్లో-బీళ్లల్లో మేసి, ఋతుకాలాలనుబట్టి లభ్యమయ్యే, సజ్జజొన్నకూళ్లు, పచ్చదంట్లు, ఎండుచొప్ప, లేతగరిక, కాయ ధాన్యాల పొట్టు-తిని చక్కగాబలిసింది; బాగాకొవ్వు పట్టింది. ఆరేండ్లు, నాటికి చూలైయ్యే పొంకాలేమీ కన్పించకపోయే సరికి తెలిసినవాళ్లంతా 'కొంచంకొవ్వు కరిగితేనేగాని, ఫలానికి రాదే ఈదూడ' అన్నారు. కొవ్వుపట్టే తిండి తగ్గించి, కేవలం ఎండుచొప్పమీద నిలిపారు. 7 వ సం|| 'చూడిపెయ్య' అనిపించుకున్నది.

... ... ...

చిలకమ్మా ఆపాళాన కూచున్నదా? 12 సం || ము వచ్చింది మొదలుకొని తండ్రి రంగప్పనాయుడు, అన్నలు అయిదుగురు, నేలనాలుగు మూలలు వెతకనారంభించినారు, చిలకకు తగువైన వరునికొరకు. పూర్వమైతే ఇట్టేదొరికేవాడు-అల్లుడు: సిగమోర వేయగలవాడు, చిక్కాలు అల్లగలవాడు, ముప్పిరిపగ్గాలు పేనగలవాడు, అరకదున్ని-కపిలతోలి-ఎద్దుల సమాళించి, గొర్తికి 3 పుట్లు పండించగల వాడు, ఎవ్వడైనా. ఇప్పుడెన్ని ఉండాలె. తల్లిదండ్రులకు ఒకరిద్దరే అయి ఉండాలి; దూరాన్నుంచీ వచ్చే ముసలిదాని ఆస్తి ఏదైనా ఉండాలి; 4 ఇంగ్లీషు ముక్కలువచ్చిన నవనాగరికుడై ఉండాలి; సిరిసంపత్తులు ఉండాలి. తిరిగీ, తిరిగీ, కడకు దగ్గరలోనే చూచారు, పొందూరులో రామానాయుడు కొడుకు బాపయ్య చౌదరిని. 5 అరకల సేద్యము. లంకంత ఇల్లు; తల్లిలేదు; కాని అమ్మమ్మ ఉన్నది; మనమడికి పెళ్లి ఎప్పుడవుతుందా, మనమరాలెప్పుడు వస్తుందా, ప్రక్కన కొంజేట్లో సుక్షేత్రమంటి 16 గొర్ల మెట్టపొలం, వారికప్పజెప్పి రాలిపోదాము, అని పక్కవలె కనిపెట్టుకొని ఉంది. వరుడు వంగవోలులో ఇంగ్లీషు బడిలో చదువుచున్నాడు. కందులబస్తాల మీదుగా, పెసలబస్తాలమీదుగా గబగబా చదువు ఎక్కి వచ్చిందిగాని స్కూలు ఫైనల్ వద్ద మళ్లపడ్డది. మొన్న ఏప్రిల్ లో చేసింది రెండవ దండయాత్ర. కళ్యాణమువచ్చినా కక్కువచ్చినా నిలువదు; అయిపోయింది. చిలకమ్మ కోవగా పెరిగి, నీటుగాదీరి, నవయవ్వనంలో, గజ్జలగుర్రంలా, కాపరానికి బయలుదేరింది. ఆమె వెంట సారెచీరలతోపాటు, 'బుజ్జాయి' కూడా 9 నెలలమాడిది, మెళ్లో పట్టెడ గంటతో, మూతిన అద్దాల సిగమోరతో, పరపైన వెన్నుతో, చిలకమ్మ అత్తింటికి నడుస్తుంటే 'అమ్మతల్లి' లా ఉంది! అందులోను కారుమంచి పెయ్యలన్నా, కోడెలన్నా, విశ్వకర్మ మలిచిన నందులూ, కామధేనువులూ. వాటినే 'వంగోలుజాతి' అని లోకమంతా గొప్పగా చెప్పుకొనేది.

... ... ...

రామానాయుడు పెద్దవాడైనాడు. అబ్బాయి చదువు, మళ్లబడ్డదేగాని వయస్సుతోపాటు నాగరిక లక్షణాలన్నీ అలవడ్డాయి. ఇక చదివిస్తే ఇల్లూ, వళ్లూ, గుల్ల అవుతుందని తోచి, "నాయనా! ఇక నేను తిరగలేను నీవువచ్చి సేద్యం, ఇల్లూ వాకిలి, సర్దుకో|" అన్నాడు. వంగోలు నుంచి అతడు చదువు సంధ్యల మాట అట్లావుంచి, ముఖ్యంగా నేర్చుకొని వచ్చినవి రెండు: తెల్లవారి లేచేసరికి, కాఫీ, పెసరట్టు; కిల్లీ, సిగిరెట్టు, పైగా, రోజూ ఒకరో ఇద్దరో కాంగ్రెసు సభ్యులను చేర్చాలనో, యూత్ లీగ్ బనాయించాలనో, కిసాన్ సంఘమేర్పరచి రంగా గారికి స్వాగత మివ్వాలనో, ఏదోపేరు పెట్టుకొని, మిత్రులువచ్చి నాలుగు రోజులు మకాంచేసి పోతుంటారు. కమ్మటి గేదపెరుగు, చిక్కని పాలకాఫీ, నేతితో దోరగా వేగిన పెసరట్లు, విడిచిపోవ సాధ్యమా! రామానాయుడు ఏరువాక పౌర్ణమినాటికి సేద్యమంతా వివరంగా

చెప్పి, చూపి బాపయ్య చౌదరి కప్పచెప్పాడు. ఇంటివద్ద వేళకింత తిని, చుట్ట కాల్చుకుంటూ, సావిట్లో 'రామా' 'కృష్ణా' అనుకుంటూ కాలంగడుపుతున్నాడు. అబ్బాయి సేద్యం ప్రారంభించినాడు.

... ... ...

అప్పటి కప్పటికే 5, 6 సం|| లైనది ఆ ప్రాంతాలకు దొరపొగాకు వచ్చి వెలిసి. ఒకటి రెండు సంవత్సరాలు నాయుడు గూడా 4 గొర్లువేసిచూచినాడు. ఎకరానికి రెండుపుట్లుపండే బంగారంవంటి రేగటి పొలం ఎందుకు కాకుండా పోయింది; అందులో మొలిచిన మల్లె, చుట్టుప్రక్కల భూములకూ ప్రాకింది. సంసారికి లాయఖు కాదని మానేసి తనకు, కమతగాండ్లకు, వచ్చేపొయ్యే పెద్దమనుష్యులకు వాడుకకు కావలసి నంతవరకు పదితాళ్లయ్యే పొలం పట్టున దేశవాళీ పొగాకు మాత్రమే వేశేవాడు. ఇప్పుడు చౌదరి 'ఏమిటి ఈ కందులు, పెసలు, ఉలవలు, సజ్జలు, జొన్నలు, అని తోచింది కాబోలు; దొర పొగాకువేయ నారంభించి క్రమేణా తనభూమి అంతటికీ అదేవేస్తున్నాడు. పెద్దకమతగాడు, వీరిగాడు, కాళ్లావేళ్లాపడి, 'పెద్ద ఎద్దులకైనా గమతం కావద్దా బాబూ,' అని ప్రాధేయపడితే, 4 గొర్లుమాత్రం జొన్న వేస్తున్నాడు. పశుగ్రాసం 6 నెలకైనా చాలడంలేదు. చాకిచెర్లనుంచీ అమ్మ వచ్చిన వరిగడ్డి రోడ్డు వరకుపోయి బండి 30, 40 రూపాయలు పెట్టితెచ్చి మేపుతున్నాడు! పప్పుదినుసులు వేయడం మానేయడం చేత పొట్టుగూళ్లస్థళం గూడ దున్నేసి పుగాకు నాటుతున్నారు. కొట్టాం పలచబడ్డది. ఆరుగాండ్ల ఎద్దులు రెండు గాండ్లకు వచ్చినవి. క్రమంగా పశువులంతా అమ్ముడు పోతున్నవి. ఒక్క చిలకమ్మ 'మాలచ్చిమి' న్నీ, ఒకముసలి బర్రెయున్నూ మాత్రమే అంత కొట్టాంలో బిక్కు బిక్కుమని ఉంటున్నవి.

... ... ...

చౌదరి అమ్మమ్మ చిలకమ్మ వచ్చిన సం|| మేస్వర్గ మలంకరించింది. చిలకమ్మే ఇంట, వంటా, పెట్టూ అంతా. వచ్చిన కొత్తలో ఒకపూట జొన్న తినేవారు. చౌదరి, మిత్రులు చూస్తే అసహ్యించుకుంటారు, అని గునిసేవాడు. నాయుడి పోడు పడలేక ఊరుకున్నాడు. క్రమంగా ఆపంట తగ్గిపోయింది. పండిన మూడు నాలుగు పుట్లైనా కమతగాండ్లకే చాలడంలేదు. చౌదరి పుగాకునారునాటికి డబ్బు అవసరం కొద్దీ జొన్నలు కళ్లంలోనే అమ్మడం ప్రారంభిచాడు. కమతగాండ్లకు రొఖం జీతం ఏర్పాటు. ఇప్పుడు కాలానుగుణ్యంగా వచ్చి పడే తెనాలి మిల్లు బియ్యమే భుక్తికి. అవి ఒకరోజు ముద్ద; ఒకరోజు సంకటి; ఒకరోజు జావ; ఒకరోజు ననుబాయ. 'చతుర్విధం అన్నం' అన్నారు గదండి! నాయుడు "సారంలేదు"అని పెదవి విరిచేవాడు; చూచీ చూడకుండా దాచిన జొన్నలు నాలుగురోజుల కొకతూరి తొక్కి తనకు మామకు వండేది గాని. మజ్జిగ సంతనలేక అరుకువ చేయడంచేత మాని వేసింది. చౌదరి స్వంత బార్నీసులు కట్టించాడు. ఇదివరకు ధాన్యపు రాసులు పోసిన కళ్లాలలో ఇప్పుడు సింగరేణి రాక్షసిబొగ్గుగుట్టలు వేస్తున్నారు. కలిసి రావడానికి బీళ్లన్నీ చెల్లి పోయినవి. మిగత సంగతెల్లాఉన్నా ఇంట్లోవంట చెరకుకు కష్టమైంది. తుమ్మకంప, కందిదుంప, గొడ్డుతొక్కుడూ దగ్గరకూర్చోని, సన్నగా మంట వేసుకుంటూ కావలసిన పక్వంలో - కూడూ, కూరా ఉడక బెట్టుకోవడానికి వీలుగాఉండేది. ఇప్పుడెప్పుడో గగనంగా వచ్చే చౌక కట్టె, నెత్తి మోపు చింతపేళ్లు రూపాయలు పోసికొనవలె. మామూలుగా నిత్యకృత్యానికి కొండలవలె పొగదుంప తెచ్చి గొడ్ల తోలుతారు. ఆదుంప పొయిలో పెట్టేసరికి పొగ ఘాటు. చిలకమ్మ

భరించలేక, పొయినిండా ఇంత దుంప వేసి, తలుపుదగ్గరతోసి యివతలికి వస్తున్నది. అరగంటపోయి చూస్తే తనఇష్టము వచ్చినట్టు పొయిమీది వస్తువు ఉడికి ఊరుకుంటుంది. ఈపొగదుంప ధూపము, వాసన ఆ సాధ్వకానికి బాగా పట్టుకుంటుంది. సారంగల జొన్నన్నాన్ని, జొన్నదంటు మంటపై, జాయగా ఉడికించి, చిక్కని మజ్జిగతో కలిపి తాగితే, కడుపులో మెత్తగా, చల్లగా ఉండేది. ఇప్పుడో హీనరకం తెనాలి ధాన్యం, అరగపట్టిన మిల్లుబియ్యం, పొగదుంపల మీద వండడం, పప్పుదినుసుల కరవు, నీళ్లమజ్జిగ, అరగక పోతే, కడుపులోనొప్పి; అరిగితే మంట. ఎంతదిన్నా, ఎప్పుడూ నిస్సత్తువే!

... ... ...

చిలకమ్మ వచ్చిన ఏడాదికి మరొక చిలక పుట్టింది. మాలచ్చిమి మొదటి ఈతకు పెయ్యదూడను పెట్టింది. తిరిగీ రెండో సంవత్సరంకట్టి యీనికోడెదూడను పెట్టింది. రెండీతలకు చిన్న చిలకమ్మకు పుష్కలంగా పాలు, పెరుగు. క్రమంగా మేతచాలక నీరసించింది. ఎన్నిసార్లో పట్నపు వాళ్లకు అమ్మేతానని బాపయ్య చౌదరి అన్నాడు గాని చిలకమ్మ వప్పుకోలేదు. "కట్టాలేదు ఈనాలేదు మేతలేని రోజులలోతిండి దండగ," అని విసుక్కున్నాడు. "కట్టనీ ఈననీ గొడ్డును చీటికట్టి తరుముతారా ఏమిటి?" అని చిలకమ్మ పులుకు పులుకున కళ్లనీళ్లు పెట్టుకొన్నది. పట్నపు వాళ్లకు బేరంసిసలైంది వట్టిగొడ్డును వెంటనే వారూ తోలుకొని పోరు. ఆఊళ్లోనే మాలమాదిగలకు మేపుకూలికి తోలి పోతారు. వీళ్లు చేలగట్టులన, చెరువు గట్టులన పట్టిన గరిక చెక్కలను దోక్కొచ్చి చక్కగా మేపుతారు. కట్టి, ఈనమోసిన నాటికి లెక్కచూచి యిచ్చి, పట్నపువాళ్లు తోలుకొని పోతారు. చిలకమ్మ అవస్థచూచి వారికమతంలో చిరకాలంగా బ్రతుకు తున్నమాదిగ అక్క-దానికూడు పడపోయింది-నేమేపు కుంటా తల్లీ రెండుపూటలా యింతగంజి పోయి చాలు; నాకు డబ్బు అక్కరలేదు-అన్నది. సరే అని బేరంవదిలేసుకొని దానికి తోలి పెట్టారు. సంవత్సరన్నరఅయ్యేసరికి ఈనమోసిన మాలచ్చిమినితెచ్చి వాకిట కట్టేసింది అక్క. చిలకమ్మ చినిగి పోయిన పాతవాయిల్ చీర యిస్తే సంబరాలు పడుతూ వెళ్లిపోయింది. చిలకమ్మ సంతోషించింది గాని చౌదరికి నోరూరింది. పసిపట్టి పట్నపువాళ్లు వచ్చి వాలినారు. 400, 500 అని ఆశ చూపుతున్నారు. చౌదరి పుగాకు మార్కెటింగ్ బోర్డు సభ్యత్వానికి కమ్యూనిస్టులతో పోటీ చేస్తున్నాడు; నారు సీజన్; పర్మిట్‌లు తీసుకోవాలి; బార్నీసులకు రేకులు కొనాలి; బొగ్గుకు అడ్వాన్సు కట్టవలెను; ఎక్కడిడబ్బు చాలడంలేదు. 25 వేలు ఈసాలున వచ్చిందని పేరేగాని 30 వేలు ఖర్చు కంటెదుట కన పడుతున్నది. ఆవు నమ్మచూపాడు. చిలకమ్మ పేచీపెట్టింది, ఈసారీ కోడెదూడ పెట్టుతుంది, దాని తల్లిచాలు అది, అని చిలకమ్మ; కాదు, అని చౌదరీ; 6 నెలలనుంచీ వాదులాడు కుంటున్నారు. కోడెదూడయితే నాలుగేళ్లలో చేతికంది వస్తుంది అని ముసలాయన ఊరుకోలేక అన్నాడు. నిన్నగాక మొన్న 1500 మూట కట్టుకొని 30 గ్రామాలు తిరిగి సన్నాసి కోడె నొకదాన్ని చౌదరి కొన్నాడు. ఆశ కలిగింది. అంతలో, ఎప్పటి మాట, నాలగేళ్లట! అనుకున్నాడు. ఈమేతలేని రోజుల్లో గొడ్డువాకిట్లో ఉసూరు మంటుంటే చూడలేము, అనేమాట చిలకమ్మకు ఆఖరుకు నచ్చిన వాదము. పట్నపువారు ఏనుగ నెక్కి నంత సంతోషముతో మాలచ్చిమి ని తోలుకొని పోయినారు. టంగుటూరి స్టేషన్‌కు చేర్చిన రాత్రి ఈని కోడె దూడను పెట్టింది. ఆస్టేషన్ మాస్టరు ఇదుగో అదుగో, అని జున్ను పాలు పోయించుకుంటూ గడుపు తున్నాడు. వాగ నింక, దొరక లేదు.

... ... ...

చిలకమ్మ తొలిచూలి బిడ్డ తర్వాత మళ్లీ, -ఉఁ ఎందుకా గాథ అంతా ...... క్రమంగా నీరసం, నిక్కాకక. కడుపులో నొప్పి, మంట ఏర్పడ్డవి. ఇప్పటికొకసారి వంగోలుపోయి డాక్టరుకు చూపించారు. గర్భకోశంలో పుండుఏర్పడిందని చెప్పి నెలరోజులుండమని పదిసారు లింజక్షన్‌లు ఇచ్చాడు. అప్పటి కేదో ఉపశమనగా ఉండేగాని ఇంటికి వచ్చిన తర్వాత యథాస్థితే; కడుపునొప్పి పోలేదు; మంటా

పోలేదు. చిన్న చిలక మాత్రం నాలుగు సినిమా పాటలు నేర్చుకొన్నది; పెద్ద చిలక కొత్త 'లోలక్కులు' కొనుక్కొన్నది. తిరిగి వంగోలు ప్రయాణమైనారు. స్టేషన్ వద్ద మాలచ్చిమిని దూరంనుంచీ చూచారు. చూచి చిన్న చిలక కొత్తగా పుట్టిన తువ్వాయిని చూడవలెనని మారాం పెట్టింది, ఏందూడో చూదామని చిలకమ్మకూ ముచ్చటేసింది. రైలు 'గరండాల్' మీద కూతవేసింది 'రారమ్మ'ని చౌదరి తొందరించాడు. వంగోలులో కీచుకీచుమనే జపాను ఆవుదూడ బొమ్మను కొనిపెట్టి చిన్న చిలకపోరు మాత్రం మాన్పించారు. డాక్టరు రెండు నెలలుండమన్నాడు. లాభంలేకపోయింది. పిదప మద్రాసుపోయి ఆపరేషన్ చేయించుకొంటే మంచిది అని స్నేహితులు సలహాయిచ్చారు. చౌదరి, నెత్తికెత్తుకున్న రాజకీయఆర్థిక, సాంఘిక, వ్యావసాయిక, పారిశ్రామికాది కార్యక్రమాలతో తీరక మరో నెల ఆలస్యంచేసి-మొన్న జనవరిలో మద్రాసు ప్రయాణం కట్టినాడు. రాయపేట కమ్మవారి లాడ్జిలో దిగాడు. డాక్టరు, ప్రొద్దున్నే రమ్మన్నాడు. చిలకమ్మ బిడ్డనెత్తుకొని గదివాకిట్లో నిలిచి ఆపీ యివీ చూపిస్తున్నది. ఇంతలో పాలవాడు ఆవును తోలుకొని వచ్చినాడు లాడ్జికి పాలుపితకను. పిల్లా తల్లి ఇద్దరు ఆవును గుర్తుపట్టినారు. తమ మాలచ్చిమి-మాలచ్చిమి సంబరంతో దిగులుతో, పాలవానికి నిలువక-గదిముందుకు వచ్చి తల్లిని, బిడ్డను చేతులు నాకడం ప్రారంభించింది. ఇంతలో చిన్న చిలక "అమ్మా! తువ్వాయి యేదే?" అన్నది. ఆమాటలోనే పాలవాని భార్య-దూడతోలు తిత్తిలో గడ్డిదూర్చిన చేటపెయ్య బొమ్మను తెచ్చి కిందదింపింది. 'మాలచ్చిమి'-చిలకమ్మలను వదిలిపెట్టి పోయి-ఆబొమ్మనే మూచూస్తూ నిలిచింది. గొడ్డుకైనా కడుపుతీపి!

... ... ...

చిలకమ్మకు తలగ్రిరున తిరిగింది; కాస్సేపు స్మృతేలేదు. చేతిలోబిడ్డ చంకదిగివచ్చి తువ్వాయిని పట్టిచూచి-కెవ్వున కేకేసి ఏడ్వనారంభించింది. తల్లికిస్పృహవచ్చి, వచ్చి ఎత్తుకొనే సరికి వళ్ళువెచ్చబడి ఉన్నది. కళ్ళనీళ్ళుపెట్టుకుంటూ గదిలోకి పొయ్యేసరికి, ముఖక్షవరం చేసుకుంటున్న చౌదరి, ఏమి ఇంకా తెములలే; డాక్టరు వద్దకు పోవద్దా? అన్నాడు. చిలకమ్మ పలకకుండా కన్నీళ్ళు కారుస్తూ-బిడ్డను మంచంమీద పడుకోబెట్టి కప్పినది. వళ్ళుమసిలి పోతున్నది. అదిరి అదిరి, ఉలికి ఉలికి పడుతూ, "అమ్మా తువ్వాయే" అని మాటిమాటికి బిడ్డ కలవరించ నారంభించినది. చౌదరి 'సంగతేమిటి'? అని గుచ్చిగుచ్చి అడుగగా "బిడ్డకు జ్వరంతగిలింది. డాక్టరును పిలుచుకొని రండి" అంది చిలకమ్మ.

... ... ...

డాక్టరు వచ్చిచూచాడు. "ఓ! ఇదెంత రెండు రోజుల్లలో తగ్గుతుంది. అయినా, మంచిది మా నర్సింగ్ హోమ్‌కు రండి" అని అన్నాడు. నర్సింగ్ హోమ్‌లో పిల్లాతల్లి చేరినారు. డబుల్ టైఫాయిడ్ హో అనిదానికి నామకరణమైంది. నాకుమల్లెనే ఈశ్వరుడుకిన్నీ జాలికలిగింది కాబోలు-చిన్న చిలకను నలుసును జేసి ప్రాణాలు మాత్రం నిలిపాడు. ఈదిగులునా ఆదిగులునా, చిలకమ్మకు మరీనీరసించింది. అన్నం వంటిపూటపడినది-ఆపరేషన్ చేయవలెను అని డాక్టరన్నాడు. "ఇస్తేమందివ్వండి-ఆపరేషన్ చేయించుకొను" అని చిలకమ్మ ఖండితముగా చెప్పివేసింది; చలవజోడులో నుంచి చౌదరి ఒకటి రెండు సార్లు ఉరిమినా లాభం లేకపోయింది. చౌదరి రెండుసంచులు ఖాళీచేసుకొని-సకుటుంబంగా ఇంటికి చేరినాడు.

తల్లికి ఆరోగ్యం నానాటికి నాసిల్లి పోతున్నది.

బిడ్డ అప్పుడప్పుడు-"అమ్మా తువ్వాయే!" అని కెవ్వున కేకసి జ్వరపడిలేస్తున్నది.

ఆఁ! అన్నట్టు, మరిచాను; శ్రీయుత సర్దార్ బాపయ్యచౌదరిగారు పుగాకు మార్కెటింగ్ బోర్డు మెంబరైనారు. ఇప్పటికి మూడుసార్లు ఆపనిమీద ఢిల్లీకి-పెద్దలవద్దకు-డెప్యుటేషన్ వెళ్లివచ్చాడు సుమా!

'లీలావతి'

# కృష్ణాపత్రిక-వడగళ్లు.

కృష్ణా పత్రిక ఈశతాబ్దారంభమున పుట్టినది. దీనిజనకులు శ్రీదేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు. శ్రీపంతులుగారును, శ్రీరాయసం వెంకటశివుడుగ్గారును ఈరాష్ట్రమున వీరేశలింగంగారి పిదప స్త్రీల అభ్యున్నతికై పాటు పడుటకు ప్రారంభించిన వారు. ఉన్నవవారి యాజమాన్యమున నడుచుచున్న శారదా నికేతనము అసలు పంతులుగారి సంకల్ప బీజమున మొలిచిన మొలక.

కృష్ణా పత్రిక, వరుసగా దాసు నారాయణరావుగారు, వేమవరపు రామదాసు పంతులుగారు, డా. పట్టాభిగారు, హరిసర్వోత్తమరావుగారు, మున్నగు ప్రముఖుల సంపాదకత్వమున నడిచి నడిచి, తుదకు శ్రీయుత ముట్నూరి కృష్ణారావుగారి చేతిలో సర్వాంగ సుందర స్వరూపము దాల్చినది. వీరందరు ఆంధ్రదేశమున పేరుగన్న సంఘ సంస్కర్తలు. సంఘసంస్కరణమున స్త్రీల అభ్యున్నతికై పాటు పడుట ప్రధమ స్థానము వహించినది. స్త్రీనిగౌరవించనివాడు-వారి అభ్యున్నతికై పాటుపడ జాలడు

శ్రీముట్నూరి కృష్ణారావుగారు సిద్ధహస్తులు. వారిలేఖిని అమృతమును వెదజల్లెడిది. అహంకారులపై, నిరంకుశులపై, దుర్మార్గులపై నది అశనిఘాతము వలె వ్రాలెడిది. కాని పతితులు, బాధితులు, నిస్సహాయులు, నిరాధారులు, అనాథలు-అన్నచో వారినది బుజ్జగించి, ఆదరించి, జాలిగొల్పు రచనలతో లోకముచే వారినారాధింప జేసెడిది. అట్టివారియెడ శ్రీరావుగారి లేఖిని ఎన్నడును, పరుషవాక్యములగాని, అపహాస్య వచనములగాని వ్రాసి యెరుగదు.

శ్రీపంతులుగారు కేవలము రాజకీయ వేత్తయేగాక, భాషాకోవిదుడు, కళా వేత్త, రసపిపాసి కూడ నగుటచే, తన పత్రికను కేవలము రాజకీయ రచనలతోనే నింపక, నవరసస్ఫూర్తి కల్పించు రచనలకు తావిచ్చిరి. కావున శృతిమించని, ఔచిత్యము తప్పని, మర్యాదతొలంగని హాస్యరచనల సంగీకరించిరి. వారికాలమున హాస్యరచనలు నిజముగా, కొరడువారిన మనస్సుల కుల్లాసము పురిగొల్పెడివి.

పెద్దమర్రి కూలినపుడు, నేలలో పెద్ద బొర్రి ఏర్పడునుగదా! ఆపత్రికయొక అస్థిగా నిలబడినదేగాని, దానినొక సంస్థగా నిలుపగల దక్షులు వారిపిదప దాని కమరలేదు కాబోలు. ప్రస్తుతము సంపాదకత్వము వహించిన శ్రీకాటూరి వెంకటేశ్వరరావుగారును "సౌందరనందము" అను కరుణోత్తర కావ్యమును శ్రీపింగళి లక్ష్మీకాంతముగారితో కలిసి వ్రాయనేర్చినవారు. అయితే వారు కృష్ణాపత్రికా నిర్వహణమునకు హెచ్చు కాలమివ్వ జాలకున్నారేమో!

వారము, వారము అందువెలువడు చున్న "వడగళ్లు" చూడగా మాయూహాస్థిర పడుచున్నది. ఈనే 3 తేదినాటి "వడగళ్లు" వితంతువులపై రాలినవి. వితంతువులెదురు

పడిన "అశుభ సూచక" మని ఈరచయిత వారి నాడిపోసుకొన్నాడు. అశుభ మనునది మూఢవిశ్వాసము. అట్టి మూఢ విశ్వాసములను అంతరింప జేయుటకే కృష్ణా పత్రిక సుమారు అర్థ శతాబ్దమునుండి కృషిచేసినది. పిదప పుట్టిన పత్రికలకు ఇది మేలుబంతి పెట్టగా నవి వరవడి దిద్దుచున్నవి. అట్టి కృష్ణాపత్రికలో- అనాథల పై కరుణారసము వర్షింప వలెను గాని "వడగళ్లు" రాలరాదు.

గత సంచికయందే రూపవాణియందలి ఇట్టి వ్రాతను నిరసించి వ్రాసియుంటిమి. నేటి రచయితలలో కొందరికిది యొక సరదాయైనదేమో? అనాథయై, ఏబంధువునింటనో బండ చాకిరి చేయుచు సంఘముచే, వ్యక్తులచే దోచబడుచు, హీనముగా చూడబడుచు పాప మావితంతువు పలుబాధల నందుచున్నది. అట్టి యామెకు తనస్థితి బాగుపరచుకొనుట కుపాయముల చూపవచ్చును; ఆమె నుద్ధరించుడని లోకమున కుద్బోధింప వచ్చును. కాని ఆమె దుస్థితిని తన హాస్యరచనకు ఉత్తమ వస్తువుగా భావించి, అసహ్యముగా రచించుట, భాషను దుర్వినియోగ మొనర్చుట; పత్రికా రచనను దూషించుట. ఇట్టి రచనల వల్ల పత్రికలు హెచ్చుగ అమ్ముడు పోవునేమో! నిజమగుచో, అట్టి వ్యాపారము నీచము; ఆధనము నీచధనము.

అయితే నేడు కన్ను మిన్ను తెలియక కొందరు రచయితలిట్లు రచించు చుండగా, ధనము గోరు పత్రికలు ప్రచురింపగా ఎల్లరుచూచి యూరుకోవలసినదేనా? దీని నరికట్టుట కుపాయాంతర మేమైన యున్నదా?

పత్రికా రచయితల సంఘమని, పత్రికా సంపాదకుల సంఘమని, కొన్ని యున్నవి. అవి నిరంతరము సమావేశ మగుచు దీర్ఘమైన తీర్మానములు గావించు చున్నవి. వారట్టి రచనల నిరసించి, ఔచిత్యమును నిర్ణయింప నగును.

ప్రభుత్వమును పత్రికల పై తమకుగల అధికారమును పురస్కరించు కొని వీనిపై చర్యలగై కొనవచ్చును.

ప్రజాసామాన్యమును ఇట్టిపత్రికలు తమతప్పును తెలుసుకొను నట్లు చేయుట కెన్నియో యుపాయము లున్నవి.

అన్నియు నొకయెత్తు; స్త్రీలుతమ కర్తవ్యమును తామెరుంగుట మరొకయెత్తు. వారుఊరూర సభలగావించి తమలో అభాగ్యలైన వితంతువుల నిట్లు పత్రికారచయితలును పత్రికా సంపాదకులును అవమానించుట తీవ్రముగా నిరసించి, తీవ్రతరమగు ఆందోళనము గావింపదగునుఅని, మాదృఢ మైన అభిప్రాయము;అభిలాష.

మాసోదర పత్రికను గూర్చి ఇంత దూరము వ్రాయవలసి వచ్చుటకు మాకు కష్టముగానే యున్నది. కాని విషయ గౌరవమును బట్టి మాకు కలిగిన ఆవేదనకొలది మేమీవిధి తప్పని సరిగానిర్వర్తింప వలసివచ్చినది. సత్ఫలితము కలిగిన సంతసింతుము.

కే. యస్. కేసరి.






పాకకళ అవశ్యకత గృహలక్ష్మికి వేరుగా చెప్పనక్కరలేదు. పాకకళ ముఖ్యోద్దేశము కేవలము జిహ్వా చాపల్యమును తీర్చుటేగాదు; ఆరోగ్యప్రదమును, బలవర్ధకమును, అగు ఆహారమును జీవులకు సమకూర్చుటయును అందులో చేరినదే. కావుననే మేము పాకకళతో పాటు గృహవైద్యమును, ఇంటిపనులను మెళకువలను జతగూర్చి ప్రచురించుచున్నాము. గృహవైద్య ప్రచురణమున బిల్లులు చెల్లించి వైద్యులవద్ద తెచ్చుకొను ఔషధములమాట అటుంచి మామూలుగా మనవంటఇండ్లలో సదా చేతికితగులు ఉప్పు, మిరపకాయ, చింతపండు లలోనుండు మేలిగుణములను, వానితో సామాన్యరోగములు సర్దుబాటు చేయగల లఘువైద్యముల నుపాయములను చెప్పితిమి. అంతేగాక వానిని నిత్యకృత్యమున భోజనపదార్థములలో విరివిగా వాడుటవలన కలుగు ఆరోగ్య స్థితిగతులను వివరించితిమి.

ఇన్నాళ్లను పాకకళయందు హెచ్చుగా లాడూ పేణీలు, హల్వాబూందీలు, పూరీపాయసములు మున్నగు పిండివంటలను చేయువిధములనే ఎక్కువగా వివరించుచున్నాము. ఆయావానికి ముఖ్యముగా కావలసినవి, పాలు, నేయి, వెన్న, గోధుమ, చక్కెర మున్నగునవి. అవి నేడు ప్రజలకంతగా లభ్యమగుటలేదు. ముఖ్యముగా కావలసిన పప్పుబియ్యములకును వున్నది. ఆయినను అంతోయింతో అవి అందరికిని అందుబాటులో నున్నవి. ఎన్నో ఆకుకూరలు, కాయకూరలు సామాన్యమైనవి మనకు ముఖ్యముగ సులభముగా లభ్యమగు చున్నవి. కావున ఆయా కాయకూరలతోను, పప్పుదినుసులతోను చేసుకొనగల శాకపాకములను అందరికిని సులభ సాధ్యమగువానిని కొన్నిటిని ఇక విశేషముగా చెప్పదలచితిమి.

ముఖ్యముగా మనము ఆంధ్రులము. కమ్మని పచ్చడుల కలవాటు పడ్డవారము. ఆ పచ్చడులను రుచికరముగను ఆరోగ్యప్రదముగను చేసుకొని తినుట కుపాయములను తెలుప దలచితిమి.

దాక్షిణాత్యులకు ఆకుకూరలు విస్తారము లభ్యమగును. దాక్షిణాత్యులు ఆకుకూరలను పచనముచేసి కడుపునిండ ఆరగించుటలో నేర్పరులని ఇటీవల గాంధీమహాత్ముడును ప్రశంసించి యున్నాడు. అట్టి ఆకుకూరల ప్రాశస్థ్యమును వివరింతుము.

ఈ రెండు ప్రకరణములలో పచ్చడులగూర్చి వ్రాయుటకై వీనియందు నేర్పుగల నొక్కభాగ్యశాలి పూనుకొన్నది. ఆమె ఇదివరకే కందిపచ్చడినిగూర్చి వివరించియున్నది. ఈ నెలలో మరికొన్ని పచ్చడుల గూర్చి, బచ్చలిఆకును గూర్చియున్నది వ్రాసి ఈ క్రింద పొందుపరచు చున్నాము.

## తెలుగువారి పచ్చళ్లు.

మా యింటిలో నన్ను పచ్చళ్లమ్మ అని పిలిచెదరు. నేను పచ్చళ్లను, నూరిననాడు మా యింటిల్లిపాది తృప్తిగా భోజనము చేసెదరు. అమ్మమ్మా! అరవవారి పులుసు, చారులకంటే, మనపచ్చళ్లే రుచిగనుంటవని మా పిల్లకాయలు అనెదరు. ఇరుగు పొరుగువారుకూడా మా పచ్చళ్లు రుచిగానుంటవని వచ్చి పెట్టించుకొని పోయెదరు. గనుక నాకు తెలిసిన పచ్చళ్లను "గృహలక్ష్మి"యందు అప్పుడప్పుడు వ్రాయుచుండెదను.

పచ్చళ్లను తయారు చేయగలిగిన సోదరీమణులు నేనువ్రాసినవాటిని గ్రహించి అందుమార్పులుండిన "గృహలక్ష్మి" ద్వారా నాకు తెలుపప్రార్థన.

### (1) పెసరపప్పు పచ్చడి.

పొట్టుతీసిన పెసరపప్పును కావలసినన్ని తీసికొని, నేతిలో దోరగా వేయించుకొని, ఆ పప్పులోనే యెండుమిరపకాయలను వేసి కొద్దిగా కలియత్రిప్పి, దించి తగుఉప్పువేసి, కందిపప్పుపచ్చడిని నూరినట్లే నూరవలయును. కడపట యింగువపాలను జీలకర్రనువేసి నూరి తీసుకొన వలయును.

### (2) వడపప్పు పచ్చడి.

పొట్టుతీసిన పెసరపప్పును కావలసినంత తీసికొని, నీళ్లలోనానవేసి, బాగుగా నానినపిమ్మట, నీళ్లను వడియగట్టి, పప్పులకుతగినట్లు యెండుమిరపకాయలుగాని, పచ్చిమిరపకాయలుగాని, ఉప్పును వేసి, వడలపిండి వలె-వక్కా-ముక్క-గ రుబ్బి అందు నిమ్మరసమును, యింగువపాలనుకలిపి, జీలకర్ర ఆవాలతో తాలించవలయును. కడపట కొత్తిమీరి ఆకును సన్నగగిల్లి కలుపవలయును.

### (3) శనగపప్పు పచ్చడి. (ఇడ్లీకి, దోసెకు.)

అంగడిలో వేయించిఅమ్మే శనగపప్పునుతెచ్చి, పొట్టునుచెరిగి పప్పునకుతగిన పచ్చిమిరపకాయలు కొబ్బెర, ఉప్పు, కొత్తిమేరిఆకు కలిపి మెత్తగ రుబ్బవలయును. కడపట తిరగమాత (తాలింపు) వేసి కలుపవలయును. పిమ్మట వాడుకొనవలయును. ఈ పచ్చడిని ప్రతి కాఫీహోటలులోను తయారు చేసెదరు. వేయించి విసరిన శనగపప్పు, మినప పప్పులతోకూడ పచ్చళ్లునూరెదరు.

### బచ్చలి ఆకు కూర. (Spinach)

మనము వాడుకొను కూరలలోకెల్లను శ్రేష్ఠమైన వానిలో బచ్చలికూర యొకటి. ఈకూరలో మంచి విటమిన్ పదార్థములున్నవి. తెల్లదొరలు ఈకూరను వండకుండా పచ్చికూరనే, ఉప్పు,మిరియాల పొడులను దానిమీద చల్లి భోజనముతో గూడ తింటారు. ఈకూరలో ఎముకల పుష్టికి కావలసిన సున్నము **(Calcium)** రక్తవృద్ధికి కావలసిన లోహము **(Iron)** విటమిన్ బి + సి అనే ప్రాణరక్షణ పదార్థములు ఉన్నవి. **(Spinach Contains Calcium 0. 06%; Iron 5. 0 mg % carotene 2600-3500 Units per 100 gms. Vitamin $B_1$. 70: Vitamin c. 48 mg. per 100 gms.**

బచ్చలికూరను ఆంధ్రులు విస్తారముగా వాడుతున్నారే కాని సుగుణములు వారికి బాగాతెలిసి వాడుట లేదనవచ్చును. దీనిని వండి వార్చకుండ భుజించవలయును, నీరువారిస్తే అందులో ఉండేమంచి పదార్థములు నీరు వెంటపోవును. ఈబచ్చలి కూరలో పలుజాతులు ఉన్నవి. మొక్క-బచ్చలి, దుంపబచ్చలి తీగబచ్చలి, బట్టబచ్చలి, మట్టుబచ్చలి, ఎర్రబచ్చలి, కాడబచ్చలి, పుల్లబచ్చలి (చుక్క-కూర) అను నవి సాధారణముగా వాడుకలోనున్నవి.

భూసారమునుబట్టి ఈకూర ఆకులు చిన్నవిగాను, పెద్దవిగాను ఉండును. రాజమండ్రి, కాకినాడ ప్రాంతములలో కాడబచ్చలి విరివిగా కాననగును. ఆప్రాంతముల వారు కాడబచ్చలితో కూడ, పచ్చి

చింతకాయలు, పచ్చిమిరపకాయలు, ఆవపిండి మొదలగు వానితో పులుసు కూరను వండి ప్రీతిగా భుజిస్తారు. ఈకాడ బచ్చలితో కందను (దురద) చేర్చి పులుసు వేసివండుతారు. కందా, బచ్చలి కూరచాలా పేరుగల శాకపాకము. సంతర్పణలలో మందిమీద ఆటివచ్చేకూర బచ్చలి (ఆకు) కూరను పులుసుని, పప్పు వేసి పలచగ వండి కూడా తింటారు. ఈకూర కొంచంమట్టివాసన వచ్చేది కాబట్టి ఇందులో ఆవపులుసు వేసి వండితే, ఆమట్టివాసనపోయి చాలారుచికరంగా ఉంటుంది. బచ్చలి ఆకువేసి మజ్జిగపులుసుకూడా చేస్తారు.

ఇంతమంచికూర అయినా నవనాగరికులు కొందరు దీనినాప్యాయముగా తినక ఏవగించుకుంటారు. ఆ ఏవగింపు ఈనాడేకాదు. 500 సం॥ నాడు వివిధ రాజాస్థానాలలో దీనారటంకాల తీర్థమాడుతూ, కవిసార్వభౌముడనేబిరుదు సంపాదించి, మంత్రిసత్తముల మహళ్లలో రాజోపచారాలతో వివిధ శాక పాకాలతో శాల్యన్నం భుజించిన - శ్రీనాధమహాకవి యొకసారి పల్నాటిలో జొన్నన్నం, బచ్చలి ఆకుపులుసుకూర, శ్రీకృష్ణుని ఉపలంభిస్తు చెప్పిన పద్య మిదిగోచూడండి:—

> ఫుల్లసరోజనేత్ర! యలపూతనచన్నులచేదు ద్రావి నాఁ
> డల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెద వేల? తింత్రిణీ
> పల్లవయుక్తమౌ నుడుకుబచ్చలిశాకము జొన్నకూటితో
> మెల్లనయొక్కముద్ద దిగిమ్రింగుమ! నీపసకాననయ్యెడిన్.

దీని వల్ల మనకీ కూరచిరకాలాగతమని స్పష్టమవుతున్నది.

బచ్చలి ఓషధి ద్రవ్యము కూడా. బచ్చలిలో మంచిజిగట పదార్థము ఉండుటేగాక క్షారము కొవ్వు, చక్కెర, సున్నము మొదలగు దేహారోగ్యమునకు అనుకూలమైన ద్రవ్యములు కూడ అందులోఉన్నవి ఇది చలవచేయును, మలబద్ధకమును పోగొట్టును. గడ్డలు పగులుటకు ఈఆకు వెచ్చచేసి కట్టెదరు. నోరుపూతకు ఈ ఆకులను నమలిన నయమగును. ఈఆకులనుండి **Oleum Chenopodi** అనుతైలమును ఆంగ్లవైద్యులు కొంకిపురుగుల **(Hook worm)** జబ్బుకు వాడుతారు. ఇట్టి ఉత్తమమైనఆకుకూరను స్త్రీలు సులభముగా తమదొడ్లలో పెంచవచ్చును. దొడ్డిసౌకర్యము లేకున్నను పట్నవాసములలో ఎండ పొడబడు ప్రదేశమున ప్యాకేజీ తొట్టిలో మెత్తని మన్నుపోసి పెంచవచ్చును.

---

## గమనించండి.

మేము ప్రచురింప జాలని రచనలు రచయితలకు తిరిగి పంపబడవు. కాబట్టి వృథాగా పోస్టుబిళ్లలు పంపకండి. నకళ్లు వ్రాసి ఉంచుకుని అసలు రచనలంపితే ఉభయత్రా సౌకర్యం.

సంపాదకుడు.

# ఇంటిపనులలో మెళకువలు

## శిశుపోషణ

గత గృహలక్ష్మి సంచికలలో గృహాంగనలు, వంటయింటిని పరిశుభ్రముగ నుంచుకొనుట, పాత్రలను శుభ్రము గావించుట, పలువిధములయిన వంటకములను తయారు చేసుకొనుట, బట్టలను శుభ్రముగా నుంచుకొనుట, పరుపులను, కప్పుకొను దుస్తులను పదిలముగా నుంచుకొనుట మొదలయిన హంశములను పాఠకులు గ్రహించియే యుందురు.

ఇప్పుడు శిశుపోషణ, సంరక్షణలనుగూర్చి ముఖ్యముగ గమనించవలసిన విధులను కొన్నిటిని మాత్రమే విశదీకరించు చున్నాము.

స్నానము:- బిడ్డలు తమ కృత్యములు తామే నిర్వర్తించుకొనజాలనందున వారి కోమల శరీరముల ననుసరించి వేడినీళ్లతో స్నానముచేయించి తేలికగను, మెత్తగను, తెల్లగను నుండు వస్త్రములతో తుడువవలయును.

సబ్బులుగాని, నూకగయుండు పిండులనుగాని స్నానాదులయందు ఉపయోగించుట మంచిదికాదు. సువాసనలతో నిండిన మెత్తని పిండిని వాడుట మంచిది.

స్నానం చేయించుటకుముందు మనదేశమున కనుకూలమగుటచే ఆముదము బిడ్డల శరీరములకు రాయుటమంచిది. అయితే జిడ్డుపోవునంతవర్కు గట్టిగా రుద్దరాదు. శరీర వేడిమికి తాళుకొనియుండునట్లు చేయుట మంచిది.

గుడ్డలపరిశుభ్రత:- గుడ్డలు యేకారణమువల్ల మాసిననూ, మురికిపట్టిననూ, వాసన వచ్చిననూ మార్చుచుండ వలయును.

ఆహారము:- తల్లిపాలె మంచిది. స్తన్యమును గ్రోలు శిశువులు, దాదులయొద్దకు పోరు. పోయిననూ, పాలుత్రావరు. త్రాగినను బలమునివ్వవు. ఆకలిచెడదు. విశ్రాంతి తప్పును. విరామము లేక ఏడ్చుచుందురు. ఇట్టి పరిస్థితులలో డబ్బాపాలు, పోతపాలు,

ఆవుపాలు, మరి యే యే పాలో పోసి డాక్టరువద్దకు తల్లిదండ్రులు పరుగులిడుచుందురు. అట్లే పాలువదలి ఆహారములను పుచ్చుకొను యీడువచ్చిన బిడ్డలకు ఆహారమిడుటలో, తొలుతనే తేలికగ జీర్ణమగునట్టిదియు, ద్రవరూపకముగ నుండునట్టిదియు, మధురమయి నట్టిదియు, శరీరపుష్టి నిచ్చునదియు యుండునట్లు తల్లులు అతి జాగ్రత్తతో చూడవలయును. స్తన్యమువదలి, ఆహారము తిను మధ్యలోనున్నూ, ఆహారముతింటూ పండ్లు వచ్చు సమయములలోను పిల్లలకు కొన్ని జబ్బులు వచ్చుచుండును. పండ్లు వచ్చునప్పుడు వచ్చుజబ్బులు—అంతకుముందు నిల్చియున్నవాని పయినవృద్ధి నొందునుగాన ఆహార విహారములలోనే తల్లులు సవరించుకొనుట మంచిది. పండ్లువచ్చు సమయములలో ఔషధములు యిచ్చుట సమయోచితముగా ఆలోచించి యివ్వవలయును.

నిద్ర:—శిశువులకు రోజుకు 16 గంటల నిద్ర అవసరము. రెండుసంవత్సరములు ఈడుగలవారికి 14 గంటలు చాలును. అయిదు సంవత్సరముల పిల్లలకు 12 గంటలు చాలును. "వెలుతురు, గాలి చొరరానిచోట వైద్యులు చేరుటకు" అవకాశం నని యొక సామెతకలదు గాన బిడ్డలు నిద్రించు గదులు నిండు వెలుతురుతోను, గాలితోను నిండి యుండవలయును. వారి నిద్రాభంగము కలుగజేయు దోమలుగాని, చీమలుగాని, నల్లులుగాని యుండరాదు. తల్లులు ప్రతిదినము వారి శైశవదశ గడచువరకు జాగ్రత్తగ చూచుచుండవలయును.

ప్రతి తల్లియు ఆరోగ్యవిధానముల ననుసరించి స్నాన, పాన, ఆహార, నిద్రా నియమములు పాటించిన పిల్లలకు ఔషధములతో నిమిత్తమేలేదు. తల్లి ఆశీర్వచనము అమోఘము.

బిడ్డయొక్క మనస్సు అతికోమల మయినందుననూ, చూపూ ఏకాగ్రచిత్తము కలదై నందుననూ, హృదయము ఆకర్షణ పూరితమైనందుననూ, తల్లి యేరూపుతో మెట్టి అలంకారములతో వచ్చిననూ కడుపున పుట్టినబిడ్డ తనతల్లియని గుర్తించును. దీనినే మాతృభావమనియు, జ్ఞానమనియు యందురు.

---




# నిమ్మకాయ

సత్తువనిచ్చు ఫలములలో నిదియొకటి. సమస్త వ్యాధులకు క్రిమియే కారణమైన్నది. అట్టి క్రిములు ముక్కు ద్వారములయందును, గొంతునందును, జీర్ణాశయమునందును, మలాశయమునందును, రక్తకణువులయందును జనించి వృద్ధియై, నాశన హేతుకరమైన సంసార రూపకములుగమారి, సమస్త యంత్రతంత్ర శక్తి స్వరూపధారులయిన మానవులను పీల్చి పిప్పిచేసి పలురోగములు పాలుచేయుచుండుట, పాలగుట మనము యెరుగనిది కాదు. మరియు ఆహార, విహార, జలవిరోధములచే సంభవించు విషస్పృష్టనలచే కొన్ని రోగములు ఉద్భవిల్లుచున్నవి. ఇంతేగాక మానవ జీవితమునకు అవసరమగు ఆహార పదార్థములు పుష్టినిచ్చునవి లభించకపోవుట, వకవేళ ధనసంపన్నులకు, వ్యాపారస్తులకు కొన్నివేళల దొరికిననూ, పదార్థములను పండించుటలో కృత్రిమ దోహదము లిడినందున వాటిగుణములునశించి, పోషణ, ధారణ, శక్తి పోవుటయేగాక ప్రస్తుత పరిస్థితులలో విక్రయధనము యేదోవిధమున సంపూర్తిగ వచ్చువరకు మూల నమగ్గించి యుండుటచే మరికొన్ని ధాతువులు నశించి కాయకష్టముచే సేకరించిన ధనమునకు సరిపోవని వస్తువులనుకొని వాడుకొనుచుండుటవల్ల మన దేశములో పండు పంట ధాన్యములయందు విలువతగ్గి, రుచి హీనమైనందున, నీరసము, అందుచే రోగములను ఎదుర్కొను శక్తిహీనతచే పలుయిడుములు పడుచుండు వారందరికి నిమ్మకాయ తగు ఉచితమగు ఫలమని చెప్పవచ్చును.

స్త్రీలు గర్భము ధరించినది మొదలు సుఖప్రసవమగువరకు నిమ్మపండు రసమును ఏదోవక విధముగ నుపయోగించిన నిమ్మపండువంటి బిడ్డలని సామాన్యముగ చెప్పుకొను వాడుకయే యదార్థములగును. ఇందులో Vitamin B. Complex ఇమిడియుండుటచే స్త్రీలకు మిక్కిలి యుపకారియని చెప్పనగును. మంచి ఆకలినిచ్చి శరీరభారము తగ్గించును.

మరియు నిమ్మకాయ ఊరగాయ రూపమున సమస్త మందికి రుచి కల్పించుటయేగాక, వ్యాపారమూలముగ డబ్బాలలో, జాడీలలో యిమిడి కొన్నిరోజులుండిననూ బేరముచేయు యిరుప్రక్కలవారికి నష్టము కల్గించకుండ ఖండాంతరములకుపోయి - ఔషధనిర్మాతలు తయారొనర్చు విదేశీయ టానిక్కంటె గుణమున పేరుపడిసి యున్నది. Saliva ను వృద్ధిచేయు ధాతుశక్తి నిమ్మపండుయందు వుండుటవలన నీరసము బలహీనతకు ముఖ్యముగ నుపయోగించునని నిర్ధారణయైనది.

ఆరోగ్యము నందైతేనేమి, ధాతుహీనత, ధాతుక్షయలోనైతేనేమి, అంటు జాడ్యములు మిక్కుటమయిన ప్రదేశములలో సంచరించవలసి వచ్చినప్పుడైతేనేమి, కురుపు పుండ్లు గాయములు మానవని తోచినప్పుడుగాని, చిగుళ్ళ వెంటరక్తము, చీము చెడువాసన, మొదలగు వాటియందు వాడిన ప్రశస్స్పృష్టి రూపము దాల్చుచుండును. మరియు వున్నదంతములను పోగొట్టుకొని అందమునకు కృత్రిమదంతముల నుపయోగించు అభిలాషయుకూడ తగ్గును.

వ్యాధిగ్రస్తులమని కాలము వృధాచేయక శ్రమపడక, దుఃఖపడక నిమ్మపండు రసమునే పలుమోతాదులు వాడిన సుగుణరాసిచే సమస్త ఇంద్రియ పాటవము బాగుపడును. శల్యరూపముదాల్చి శరీరమును సివిటమిన్ శక్తిచే మరల రక్తమును పూరింపజేయు ననుటలో అతిశయోక్తి యెంతమాత్రమును లేదు.

నిమ్మకాయయందు విటమిన్స్ యిమిడి యుండుటచే శరీరకాంతి, తేజస్సులను వృద్ధిచేసి ఓజస్సు బలము, గట్టియెముక, బిగిగల కండరములు, దివ్యదృష్టి కలుగును.

ఆటప్రదేశములలో Foot ball, Cricket, Badminton మొదలగు పందెములలో యువకులు కడు అలసి, క్రీడాస్థలమును వీడలేక, ఆలోచించుటకు వీలులేని సందర్భములలోకూడా నిమ్మకాయను జాగ్రత్త పర్చుకొని ఉపయోగించుట, ఏవైపు వారియందు నిమ్మపండ్లు అధికముగ నుపయోగింతురో వారిదే జయము అని నిస్సందేహముగా చెప్పవచ్చును.

## ఉపయోగములు.:

పిప్పి గోరువల్ల- చేతివేళ్ళకు జెష్ట సంభవించును. వేలిచివర భాగము వాచి మితిలేని బాధకల్గును అట్టిదానికి నిమ్మకాయను వేలికి తగినంత రంధ్రమునొనర్చి వేలునకు తొడుపుగా తొడిగిన నొప్పితగ్గి క్రిమి తీవ్రత తొలగి, వేలు మామూలు స్థితికి వచ్చును.

దుష్టరక్తము చేరియుండు శరీర భాగముపై నిమ్మగాయ రసము పూసి రెండుఘంటల సేపు వుంచి తదుపరి గోరు వెచ్చని నీటితో కడిగిన ఉపశాంతి యిచ్చుట యేగాక బిగిసియుండుట పోయి నరములు సడలును.

పేను వదలని తలలకు కొబ్బరి నూనెలో హారతి కర్పూరమును, నిమ్మకాయ రసమును చేర్చి తలకు రాచి ఒకరాత్రి యుంచి మరురోజున స్నానము చేయించిన పేనువృద్ధియగుట నిల్చిపోవును.

సామాన్యముగా కొంతమందికి "పెట్టుడు మందులు" పెట్టిరని భ్రాంతినొంది చిక్కి కృశించి పిచ్చిపట్టిన వారివలె మనోవ్యధకు పాలగుచుందురు. అట్టివారికి ప్రతిరోజు ఔషధ రూపకముగా మార్చి యిచ్చి, హితబోధచేసిన మనస్సు శాంతిపడి చిత్తచాంచల్యము వదలి క్రమస్థితికి రాగలరు.

ఆయుర్వేద సిద్ధాంతముల ననుసరించి శుద్ధియొనర్చుటకు ముఖ్యసాధనమైయున్నది.

మలబద్ధకము ఆకలి లేకుండుట. అతిదాహము, నిద్రలేకుండుట, కలలతో కూడిన నిద్రగలవారు వక నిమ్మకాయ రసమును వకమారు దాహమునకు సరిపోవు నీళ్లలో పోసి, విత్తులు తీసి, ఆనీళ్లను వక గ్లాసులో వకరాత్రియుంచి మరునాడుదయమున పరగడుపున త్రాగిన ఆరోగ్యమిచ్చి, హాయినొసగును.

# బ్రతుకు తెరువు

(ఆమ్ల తలనూనె Amla Hair Oil)

ఆమ్లమనగా ఉసిరికాయ. దీనిరసముతో తయారుచేయ బడిన తలనూనె తల వెండ్రుకలు నెరసి పోవుట ఆపుటయేగాక తలలోని వేడిని పోగొట్టి బుద్ధి కుశలతనిచ్చును. కావున ఆమ్ల తైలము అమూల్యమైనది.

ఇది తయారు చేయువిధము

పచ్చి ఉసిరిక కాయలను దెచ్చివాటిలో యుండిన విత్తులను తీసివైచిన పిమ్మట కాయలను రోటిలో వేసి మెత్తగదంచి సన్నగుడ్డలోవేసి రసమును పిండి వడియ గట్ట వలయును. ఈవడియగట్టిన రసము వక భాగమును, నువ్వులనూనె రెండు భాగములను యేకముగ కలిపి సన్న సెగను ఉసిరిక రసము యినుకు వరకు కాచి పాత్రిలోకి వడియగట్ట వలయును. తైలములో నీరులేకుండా కాచ వలయును. అనగా తైల ములో ఉసిరిక రసమంతయు యినికిపోయి అడుగున వుండుమడ్డి మగినమువలె యుండును. గరిటెతోతీసి చేతితో వుండచేసిన మృదువుగ వుండయగును. దీనిని మగినపాక మనెదరు.

సదరు వడియ గట్టిన తైలములో తమకు యిష్టము వచ్చిన అత్తర్లను కలిపి వాడుకొనవచ్చును.

ఈ తలనూనెను తయారుచేసి బుడ్లలోనింపి కార్కులు బిగించి లేబిల్సును అంటించి పాకింగుచేసి వ్యాపారము చేయవచ్చును.





*

# పిరికిమందు

శ్రీ నేమాన సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

"బూచివాని పిలువనంపనా? గోపాలకృష్ణ... .. ...........
బూచివచ్చెననుచు నెంత నూచినాను నిదురబోవు............"

అని:—

"అల్లదుగో బూచివాడు వస్తాడు నాతండ్రి పవళింపరా............"

అని పాడుతూ ఉగ్గూపాలుపోసి ఉయ్యాలలో పడుకోబెట్టి, ఊచుతూ నిద్రబుచ్చుతారు పిల్లలని తల్లులు; అంటే అప్పటినుండి పిల్లలమనస్సులకి అధైర్యభావాన్ని అంటిస్తున్నా రన్నమాట—ఆపిల్లలు కొంచెం పెద్దవారై, వారంతట వారు వాకట్లో ఆడుకొనేవయస్సులో వారిని భయపెట్టడం చాలా రకాలున్నాయి; అందులో ముఖ్యమైనది బూచాడువచ్చి నిన్నెత్తుకపోతాడన్నదే; –"బూచాడు అనేవాడు లేడు, ఊరికనే అమ్మ అంటూంది" అనే జ్ఞానం పిల్లలకి కలిగినతరువాత, –పిల్లలకంటికి కొంచెం భీకరంగానున్న వ్యక్తిని వాళ్లకు చూపించి "ఒరేయి అబ్బాయీ, ఇదిగో ఈయన్నిచూశావా! ఈసారిగాని నువ్వు అల్లరిచేస్తే ఇకను నిన్నెత్తుకుపోతారు" –అని చెప్తూ ఆవ్యక్తితో "ఏమండీ, ఈ సారి మావాడు అల్లరిచేస్తే తప్పకుండా ఎత్తుకుపోండీ!" –అనికూడా చెప్తారు. దానికావ్యక్తి "ఓ తప్పకుండాను ఈసారి అల్లరిచేసినా, ఏడ్చినా, చెప్పినమాట వినకపోయినా అమాంతంగావచ్చి ఎత్తుకుపోతాను" అంటాడు. –ఈ మాటలన్నీ వింటూన్న శిశువు బిక్కమొఖంపెట్టి తల్లిఒడిలో దూరిపోతాడు.

శిశువు అల్లరిచేసి ఏడుస్తున్నప్పుడు ఈ "బూచివాడు" అనే ఆయుధం వానిమీద ప్రయోగిస్తే తాత్కాలికంగా కొంత లాభమున్నా ముందు ముందు అదిచాలా విషమిస్తుంది. ఏమంటే అవసరంవచ్చి పొరుగునున్నవారింట పుస్తకం తీసుకురమ్మంటే "అబ్బో! దార్లో బూచాడున్నాడు నాకు భయమేస్తుంది" అని కొట్టిపారేస్తారు పెద్దవాళ్లమాట. ఇందుకు మూలకారణం స్వయం కృతాపరాధమే. –దీనికి ఉదాహరణగా ఒకసంగతి చెప్తాను: –మా భారతికి మాపొరుగునఉన్న తురకల అబ్బాయి 'నన్నా' అంటే అపరిమితమైన భయం. ఏమాత్రమైనా అల్లరిచేసిందా అంటే "అదుగో నన్నా ఒస్తూన్నాడు" అంటే సరి పెరట్లోకి పారిపోతుంది. ఇందుకు మూలకారణం మేమే.!!

ఆవేళ మాయింట ఏదో పండుగ. నలుగురు నాలుగుపనులలోను ఉన్నారు. మాభారతికూడా లక్కపిడతలు, గాజుబొమ్మలు పెట్టుకొని ఆడుకొంటూంది. అయినా దానితో మాఅమ్మ "పక్కింటివారు మన పప్పుగిన్ని పట్టికెళ్లారు త్వరగా అడిగి తీసుకురాఅమ్మా" అని చెప్పింది. –దానికది మొఖం ప్రక్కకి తిప్పుకొని "అబ్బో దార్లో నన్నా ఉన్నాడు, నేనువెళ్లను" అనేసింది. –పప్పుగిన్ని అవసరం, తెచ్చి పెట్టేవారు ఇంకెవరూలేరు. ఇదివెళ్లనని నిర్మొహమాటంగా చెప్పేసింది. –మాఅమ్మకి చెప్పలేనంతకోపం వచ్చేసింది. కోపంవచ్చినా చేసేదేముంది? మొదటనే భయపెట్టిందిగా నన్నాను చూపెట్టి –"నన్నా లేడు వెళ్లమ్మా" అని ఎంతచెప్పి బతిమాలినా వినదు, వెళ్లదు, నన్నా మింగేస్తాడన్న భయమే.

ఇంతకూ చెప్పే దేమిటంటే మొదట పిల్లలని భయంపెట్టే వచ్చునుగాని, ఆమర్నాడు మనమే బాధపడవలసి వస్తుంది. –అప్పటి మనబాధ అటుంచినా ఆపిల్లలే వారి భావిజీవితంలో చాలా బాధపడి పోతారు. –మొగపిల్లవాడైతే పెరిగి పెద్దవాడైనతరవాత నలుగురు పెద్దమనుష్యులని చూచి మాటాడి కార్య

సాధన చేసుకొని రావలసినవాడా? అటువంటివాడికి చిన్నప్పటినుంచి తల్లిదండ్రులు నూరిపోసిన పిరికి మందువల్ల కొత్తవాళ్లని చూచి భయపడ్డం అలవాటై పోతుంది. - అంచేత కొత్తవాళ్లముందు వాడికి నోరే లేవదు. - ఇకను వాడేం వ్యవహారవేత్తయి దేశాన్ని ఉద్ధరిస్తాడు.?

అన్నట్టు చెప్పమరచేను, దెయ్యాలని పిల్లలని భయపెట్టడం ఒక తరహా. బూచివాడికి అపరిచిత వ్యక్తికి భయపడని వయస్సులో ఈ దెయ్యాలనిచెప్పి భయపెడతారు. - దెయ్యాలంటే పిల్లలకే కాకుండా పెద్దవాళ్లకుకూడా మనలో చాలామందికి భయం. మనకేకాకుండా మతాంతరులక్కూడాను. - ఇందుకు కారణం కొంతవరకూ చిన్నప్పుడు పెద్దవాళ్లచేత భయపెట్టబడడమే. - అందుకే చాలామంది పిల్లలతండ్రులే పెళ్లాలని సాయంతీసుకొని రాత్రిళ్లు బయటికొస్తారు.

దేశంయొక్క భావి భాగ్యోదయానికి కారణభూతులైన శిశువుల హృదయాలలో ధైర్యం, సాహసం, కార్యదీక్ష, మొదలైనవన్నీ మొలకలెత్తించాలి. తల్లి దండ్రులదగ్గర పెద్దవారిదగ్గర పిల్లలకి భయం ఉండవచ్చు తప్పకుండా ఉంచాలి కూడాను. కాని, వారి భావి జీవితాన్నంతా వ్యర్థపరచే ఇటువంటి పిరికిమందును మాత్రం పోయకూడదు. చిన్నతనంలోనే పిల్లలకి పెద్దవారిచేత బోధింపబడ్డ ఎటువంటి మహత్తర విషయాలైనా అచంచలంగా వారి కోమలహృదయాలలో హత్తుకు పోతాయి. ఆ శరీరాలు పోయినా వారి వీర్యముల్లో ఈ గుణాలు సహజములై పోతాయి.

అంచేత పిల్లలని భయపెట్టి నిర్వీర్యులుగాచేసి తద్వారా దేశానికి ద్రోహంచెయ్యవద్దని భావి భారతవీరుల్ని తయారుచేసే ప్రతి తల్లి దండ్రిని ప్రార్థిస్తున్నాను.

శాంతిః

# ఆంధ్ర వీరపత్ని



శ్రీ పెండెం సూర్యనారాయణరావుగారు.

వీరవిహారమున్ సలిపి, విశ్రుత కీర్తి వహించి ఆజిలో
వైరుల గుండియల్ దివిచి, వచ్చెడి నాథుని కౌగిలింతలో
జేరి, సుఖింప గల్గు వనజేక్షణ భాగ్యము మాటిమాటికిన్
తీరని కోరికల్ హృదయ తీవెల మీటుచు బాట చూచుచున్

తెలుఁగు జోదుల శౌర్యంబు తేట పడగ,
నొక్క కరమున ఖడ్గంబు జక్క బట్టి,
కోడె ప్రాయంపు మీసాల కొనలు ద్రిప్పి,
మోము నందున చిరునవ్వు మొలక లెత్త
జీవితేశుడు తన్వేగ జేర రాగ.

యవన రాజన్య మస్తకం బవని గూల్చి,
తెలుఁగు కత్తుల పస జూపితే రణంబు
నందు; మ్లేచ్ఛరక్తంబు పానంబు జేసి,
తృప్తి నందెనె భూమి సుషుప్తి వదలి;
తెలుఁగు జెండాలు ఎగిరెనే దీప్తిమీర?-

అనుచు సంతోష స్వాగతం బతివ మిన్న
భర్త కొసఁగుచు కెంగేలు బట్టి, వీర
పత్నినే కాదు; నే డాంధ్రమాత ఋణము
దీరె- అగ్నికీలలు తెల్గు వార లనఁగ!

స్వాగతం బిచ్చు ప్రియసఖి స్వాంతనంబు
నెట్లు రంజింప జేయుట కేమి దోప
కూర కుండెను; తల వాల్చి గోట నేల
గీటు చుండెను నోటను మాట రాక.

ఆ లలనా మణి యప్పుడు
వాలిన తననాథు మోము వాడియు నుండన్
కోలను దగిలిన గోల్పులి!
లీలను చరచరను బల్కె; "లేలెమ్మబలా!"
"ఎన్నడు గాని యాంధ్రులు మరెంతటి శత్రువు లెత్తి వచ్చినన్
వెన్నును జూపినారె? అరివీరుల గుండెలు తల్ల డిల్లగా,
మన్నును మిన్ను నేకముగ భ్రాంతిని నొందఁగ జేయలేదె? ఈ
తెన్నున బారి వత్తురె? మదీయ కరాంకిత కంకణంబులీ
వన్నియు దీసికొమ్ము? ఎది - యాయుధమి; మ్మది నేను దాల్చెదన్.
తిరిగి వచ్చిన ప్రాణేశు మరల బంపె;
సంగరంబున వైరుల నుగ్గు జేసి,
అసువులం బాసి దివిజేరె నాపతాపు;
డతని ననుగమించెను సాధ్వి యగ్ని దుమికి;
అట్టి వీరపత్నుల కిది యంకితంబు!

—— :o: ——

# శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి షష్ఠిపూర్తి

ఈ మాసారంభమున రాజమహేంద్రవరమున వైశ్య సేవాసదన రజితోత్సవమున్నూ, సదన కార్యాధికారిణి శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి షష్ఠిపూర్తియుత్సవమున్నూ వరుసగా రెండురోజులు జయప్రదముగ జరిగినవి. ఆంధ్రదేశము నలుమూలలనుండి వైశ్య ప్రముఖులు పలువురు విచ్చేసిరి.

సేవాసదన రజితోత్సవానికి అధ్యక్షత వహించిన శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారు శ్రీ నాళం రామలింగయ్యగారి దాతృత్వమును, శ్రీ కామాక్షమ్మగారు సేవాసదనమును నడుపుచున్న చాకచక్యమును ప్రశంసించిరి.

మరునాడు శ్రీ కామాక్షమ్మగారి షష్ఠిపూర్తి యుత్సవమునకు శ్రీ మోతే నారాయణరావుగారు అధ్యక్షత వహింపగా నెల్లూరి వాస్తవ్యులు శ్రీ పైడా సుబ్బరామయ్యగారు ప్రారంభోత్సవము సల్పిరి. తర్వాత శ్రీ ఉప్పుటూరి పున్నారావుగారు షష్ఠిపూర్తి సంచికను కామాక్షమ్మగారికి సమర్పించిరి. తదుపరి - శ్రీ కామాక్షమ్మగారి శిష్యురాలు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు భవననిధికి వసూలైన 32 వేల రూ. లను ఖర్చులుపోను మిగత, వారికి సమర్పించిరి.

శ్రీమతి కామాక్షమ్మగారు దానిని స్వీకరించి . తన జీవితాన్ని తన సర్వస్వమునూ సదనం సేవకే వినియోగిస్తాను అని పలికిరి.



తల్లీ, పిల్లా భగవద్దర్శనమునకై దేవాలయమునకు వెళ్లుట.

# ప్రతిఫలం

శ్రీమతి ఘండికోట సావిత్రమ్మగారు.

"అక్కా! అమ్మ రాగానే, కాస్త చల్లగాలి తినడానికి షైరుపోదామా?" అంది జడవేస్తున్న అక్కతో శశి. "పోదాంలే! కదలకు ఎప్పుడూ తిరగాలనే ఉంటాయి కాళ్లు. అమ్మ ఎంతఅవస్థపడి వస్తుందో ఇంటికి, మనం ఇంటలేకపోతే ఎలాగు" అంది మాలతి. "పోనీలే! ఎప్పుడూ ఇంతే నీసంగతి, ఎక్కడికేనా వెళదామంటే చాలు వెనక్కి లాగుతావు. నీచక్కదనం ఎవరేనా కొరుక్కు తింటారనా" అని అక్క ముఖంలోనికి చూస్తూ కొంటెగా అంది శశి. మాలతి చెల్లిమాటలకి చిన్నగా నవ్వింది.

సాయంకాలం 5 గంటలైంది. ఖార్ఖానా ఫుంగా జోరుగా ఊదింది. తాయారమ్మ పనివదలి చక చకా నడిచి పోతూంది. ఇంటికి రాగానే ఇద్దరు పిల్లలు చిరునవ్వుతో స్వాగతమిచ్చారు.

"అమ్మా! నేనూ, అక్కా, కాస్తదూరం షైరు వెడతామే, ఎప్పుడూ ఇంటికాపలాయేనా," అంది శశి. తాయారమ్మ పెద్దపిల్లవైపు చూచింది. మాలతి తలదించేసుకుంది. "సరే! వెళ్లండి, వేగం వచ్చేయండి, కాలాలు బాగులేవు, తురకల అల్లరిజోరుగా ఉందట" అంది తాయారు.

అక్కా చెల్లెలు, చక్కగా ముస్తాబై, చెట్టాపట్టాలు వేసుకొని, వనకన్నియలు లాగ బయలుదేరారు తియ్యగా పాడుకొంటూ, ఆనందంతో సాగిపోతున్నారు.

తిన్నగాపోయి రైలువంతెన ప్రక్కనున్న బండపైని కూర్చున్నారు. వంతెనలో నుండినీరు జారుగా పారుతూంది. పిల్లలిద్దరూ పారుతున్న వాగులో, చిటితరంగాల్ని, గంగాభవాని మంజీరధ్వనులను మేళ వించే గులకరాతి గలగలలు వింటూ యీకబురు ఆకబురు చెప్పుకుంటూ కూర్చున్నారు.

కొంతసేపటికి సూర్యుడు మెల్లగా జారిపోయాడు. అక్కచెల్లిళ్ల మాటలకి అంతమే లేకపోతూంది.

నీటిజోరుకి, ఎంతసేపటినుండి కొడుతుందో రాతికట్టు గోడని, ఒక్కసారిగా గుభీమని నీటిలో కూలిపోయింది. అక్కా చెల్లెలు త్రుళ్లిపడి బైటకి వచ్చారు. పట్టాలతోసహా నీటిలో పండుకున్నాయి ఒక్కమారుగా దూరంనుండి భూతంలాగ పెద్దలైట్లతో రైలు వచ్చేస్తుంది.

"అక్కా! చూశావా, రైలువచ్చేస్తుంది, వంతెన ఒక్కమారుగా కూలిపోయింది. ఎన్నిప్రాణులు ఇక్కడ బద్దలైపోతారో, ఏం చెయడం!" అంది శశి.

"ముందుకిపోయి నా ఎర్రచెంగు ఊపుతాను, నువ్వు ఆపమని జోరుగాకేకవేయి." అంది మాలతి. ఇద్దరూ పరుగెత్తుకుంటూ, ఫర్లాంగుదూరం వచ్చారు. మాలతి ఎర్రచీర జెండాగా ఊపుతూంది. శశి జోరుగా కేకవేస్తుంది. దూరంనుండి లైటులో ఎర్రజెండా చూశాడు డ్రైవరు. తురక దుండగీండ్ర ప్రభావమేమో అని తలచి చేత రైఫిల్‌తో బ్రేక్ వేయడం మొదలు పెట్టేడు.

రైలు జోరు క్రమంగా తగ్గుతుంది. పిల్లల సంతోషం మరీహెచ్చుతూంది. డ్రైవర్ కోపంగా, "రెచెడ్ గరల్స్ గెటవుట్," అంటూ, చీదరించుకొని ట్రిగ్గర్ లాగేడు. "అక్కా!" అంటూ పడి పోయింది శశి. మొర్రోమంటూ వంతెన దగ్గరకొచ్చి ఆగిందిరైలు. యీదృశ్యాన్ని చూడలేక, చవితి చంద్రుడు నీలిమబ్బులో దాగున్నాడు.

# స్త్రీల వాఙ్మయము

శ్రీ ఏ.ఎల్. యన్. శాస్త్రి గారు, బి.ఏ.

సందకాడ చాకిల్లు తొక్కవద్దంటి;
మూడిళ్ల ముంజూరు దుయ్య వద్దంటి;
వాల్చిన రోకల్ని దాటవద్దంటి;
పొద్దున్నె పొరుగిల్లు పోవద్దనంటి.

చింతపూవు చింతపువ్వు వియ్య మందేయి;
చింతపూవు రాలింది సిరి గడపలోను;
నేనున్న తమ్మయ్య వియ్యమందితే
మల్లెపూ రాలింది మా గడపలోను.

వాసన లేని పువ్వు పూసేమి ఫలము;
వద్ద పురుషుడు లేని వగలేమి ఫలము;
కాయగూరలన్ని కాసేమిఫలము;
వల్లభుడు లేని వంట వండేమి ఫలము ?

కాటుక కన్నుల్ది కర్రావు పెయ్య!
చెరువునీళ్లుతాగి చెంగలిమేసె;
గుంటనీళ్లుతాగి గుజ్జెన్న మేసె;
వచ్చెనే మనవీధి వాడవాడలకు;
కట్టరా అన్నయ్య గాజుకంబాల;
ముడివేయర తమ్మయ్య ముత్యాల కొలికి;
పితకరా అన్నయ్య బిందెల్లలోను;
అందుకోవే పిల్ల ఆపాలచెంబు;
కాగబొయ్యే వదినె కాగుల్లలోను.

—:o:—




# కూచిపూడివారి ఆహార్యము.

శ్రీమతి ఎం. సుశీలగారు

సర్వకళామూర్తి భగవంతుడు. ఆభగవదంశగల మానవుడు కూడా, తన అభ్యుదయాన్ని, లలిత కళల రూపంలో వ్యక్తపరుచుకొంటున్నాడు. లలితకళలన్నిటినీ, ఒకే ఒకకళలో రంగరించి, తన ప్రతిభను, ప్రజ్ఞను చూపాడు మానవుడు. అటువంటి సర్వతో ముఖమైనదే నాట్యకళ. అందుచేతనే ఒక కళకు, వేరొక కళకు, అద్భుతమైన మైత్రివుందని విష్ణుధర్మోత్తరకారుడు సూచించాడు.

మానవదేహ సౌందర్యము, సౌష్టవం, సర్వాంగ సంచలన సౌకుమార్యం, నాట్యమందే వ్యక్తమౌతుంది. సంగీతానికి, కవిత్వానికి, గళము నుపయోగించు మానవుడు, నాట్యానికి యావత్ శరీరాన్ని వుపయోగిస్తున్నాడు. మానవ శరీర సంచలనంలో, ప్రకృతికాంత ప్రతిచిన్న చేష్టనూ, ప్రతిచిన్న విన్యాసమును సువిదితం చేయవచ్చు. ప్రశాంతమైన పిల్లతెమ్మెరను, ప్రళయ ఝంఝామారుతమునూ, చిరుతగల కదలికను, కడలి పొంగునూ ఆయా శరీర సంచలనంలో, ఆయా అభినయంతో, సదస్యులకు మానవుడు వ్యక్తపరచగలడు. తనలో వుండే వుత్తమత్వాన్ని, తనదేహసంచలనంలో ప్రదర్శించగలడంటే అది మహా విచిత్రసృష్టి అని చెప్పవలసి వుంది.

ఆంధ్రులు సహజంగా భావోద్రిక్తులు-ఉన్మత్తభావశాలులు. ప్రకృతిలోని ఏచిన్న సౌకుమార్యం చూచినా, ముగ్ధులై పోయే మనస్తత్వంకలవారు. అందుచేతనే, అగ్రతాంబూలం పుచ్చుకొన్నారు. మన శిల్పాలను గమనించి నట్లయితే, మనం నాట్యకళలో అనాదినుంచీ ప్రసిద్ధికెక్కిన ఈకళకు, దానిఔన్నత్యానికీ, ఆంధ్రులు భాగస్వాములు. ఆంధ్రుల అగ్రస్థానానికి నిదర్శనంగా తప్ప, మరే ఇతరలిపిలోనూ దొరకలేదు. దొరికినగ్రంథాలన్నీ ఆంధ్రదేశంలోనివే.

కూచిపూడి ప్రాచీన ఆంధ్రనాట్యానికి పుట్టినిల్లు. ఆంధ్రనాట్యాచార్యులు, దక్షిణానికి పోయి ప్రాచీన ఆంధ్రనాట్యాన్ని ప్రచారంలోకి తెచ్చారు. దేశకాలపాత్రలకులోనైనది ఆంధ్రుల నాట్యప్రభ. కథకళినాట్యానికి మాతృక, కూచిపూడి నాట్యమని విద్వాంసుల విశ్వాసము.

కూచిపూడి నాట్యమనగానే భామ కలాపం వెంటనే మనసుకు తట్టుతుంది. కూచిపూడి భాగవతుల భామకలాపం-నృత్యనాటిక - ఒకానొక వ్యక్తిత్వం సంపాదించుకుంది. భామకలాపం రాయడానికి సిద్ధశాస్త్రి జీవితంలో కలిగిన పరివర్తనమే కారణం. సిద్ధశాస్త్రి-కూచిపూడి భాగవతుల కులగురువు-గొప్ప

రసికుడు. భామకలాపంలోని ఇతివృత్తం నుండి సేకరించ బడినది. భామకలాపంలో నాయకుడు శ్రీకృష్ణుడు. నాయిక సత్యభామ. ఈ భామకలాపాన్నే పారిజాతాపహరణమనీ మరోపేరుతో పిలుస్తారు. ఈనృత్య నాటిక ఆడడానికి సరిగ్గా నవరాత్రులు పడుతుంది.

కూచిపూడివారి ఆహార్యం ఇతరనాట్యాల ఆహార్యంకంటే వింతగా గోచరం అవుతుంది. నటకుని యొక్క భావం, తానుధరించే వస్త్రంలోనూ, ఆభరణాలలోనూ, చూపించడం ఆహార్య అభినయం అంటారు. ఎఱ్ఱగుడ్డ కోపాన్నీ, నల్లగుడ్డ దుఃఖాన్నీ, తెలుపుగుడ్డ స్వచ్ఛతనీ, వంగపండుగుడ్డ నివేదననూ సూచిస్తాయి. కూచిపూడివారి అలంకరణ సామాగ్రి అంతా కఱ్ఱతో తయారయినది. ఆ కఱ్ఱపనిమీద తళతళ కాగితాలు చిత్రవిచిత్రంగా కత్తిరించి అంటిస్తారు. కిరీటం, కఱ్ఱకిరీటం, భుజకీర్తులు కఱ్ఱవనే, ఇంక-స్త్రీధరించే జడకూడా కఱ్ఱతో తయారయినదే. కూచిపూడి ఆహార్యంలో ఒకప్రత్యేకత అందరికి స్పష్టంగా కనిపిస్తుంది. నటుడు ధోవతీని పరికిణీలా ధరిస్తాడు. కిరీటం నుండి ఒకతాడు కిందకువ్రేలాడుతుంది. ఆతాడు చివర ఒకజేబు రుమాలుకట్టి వుంటుంది. జేబురుమాలు పట్టుకొని నటుడునాట్యంచేస్తాడు. కూచిపూడి భామకలాపంలోని భామ ఆహార్యంగురించి, దాని ప్రాముఖ్యత గురించికొంచెం విపులంగా తెలుసుకొందాం.

తెరవెనుక ప్రార్థన పూర్తికాగానే 'దరువు' తో "భామనే సత్యభామనే" అని తనంతట తానే పేరుచెప్పుకుంటూ సత్యభామ రంగస్థలం మీదికి ప్రవేశించి, తనజడనొకసారి తళుక్కుమని మెరిసేలా, వయ్యారంగా ఇటుఅటూ ఆడిస్తుంది. అన్నట్లు భామధరించే ఆభరణాలు ఎన్నోవుంటాయి. తలకట్టుసామాను-రాగిడీ, చంద్రవంక, సూర్యుడు, చెవులకి-కమ్మలూ, చేర్లు, జూకాలూ, కర్ణపత్రాలూ, తాయెత్తులు, చేతులకీ-దండకడియాలు, మత్స్యాలూ, పోఛీలూ, కంకణాలు, కాళ్ళకి-కడియాలు.

ఇంక, కంఠాభరణాలను గురించి గమనిద్దాం. కంఠానికి కొంచెంపైగా, చిన్నపతకం ధరిస్తుంది. మెడలోచిన్న పతకానికి కిందగా పెద్దపతకం, పట్టెడ వేసుకుంటుంది. ఇంకనడుముకు బిళ్ళల మొలతాడు కట్టుకుంటుంది. ముక్కుకిఅడ్డబాస, కట్టడపు బులాకీ, ముక్కుపుల్ల.

ఆమోస్తరుగా కూచిపూడివారి ఆహార్యం అభినయానికి అనువుగానూ, సాంప్రదాయ పూర్వకంగానూ వుంటుంది. కూచిపూడివారి పాత్రపోషణలో, ఆహార్యానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చినట్లుస్ఫురిస్తుంది. సర్వం-కృతకాలం కరణే అయినా, కొంతసౌకుమార్యం కనుపించకపోయినా, వారినాట్యాభినివేశానికి చిహ్నంగా అనుశ్రుతంగా వాడబడుతూన్న ఆహార్యాన్నే ఇప్పటికీ అనుసరిస్తున్నారు. ఇప్పుడిప్పుడు ప్రాతక్రొత్తల కలయిక ఫలితంగా, కూచిపూడివారుకూడా వేషధారణంలో ఒకానొక క్రొత్త సొగసు తెస్తున్నారు.

—ఎ. ఐ. ఆర్. అనుమతిని

—(o)—

# 'వీట్‌నామ్' స్త్రీల త్యాగము ::

 అనువాదం: శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణాదేవిగారు.

ఈ రోజున జరుగుచున్న 'వీట్‌నామ్' స్వతంత్ర పోరాటములో స్త్రీలు ధైర్యసాహసములతో పోరాడుచున్నారు. యుద్ధరంగపు వెనుకభాగమున పురుషులకు తోడ్పడుటయేగాక రణరంగములో అస్త్రములతో ఫ్రెంచి సామ్రాజ్యవాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడుచున్నారు.

ఇది ఆదేశపు స్త్రీలకు నూతనమేమీకాదు. జాతీయోద్యమపు మొదటిరోజులలో దేశ స్వాతంత్ర్యము కొరకు స్త్రీలు గృహములనుదాగి తమ కర్తవ్యమును నిర్వహించుటకు పురుషులతోబాటు ముందు కొచ్చారు. అట్టి వీరనారీమణుల ట్రంగుట్రాక్,ట్రంగుని చరిత్ర.

వీట్‌నామ్ దేశములోనికి, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు రాక పూర్వం చైనా సామ్రాజ్యవాదులతో పురుషులతోబాటు స్త్రీలుకూడా స్వాతంత్ర పోరాటములోనికి దుమికారు. దుష్టుడైన చైనాగవర్నరుకు వ్యతిరేకంగా టాన్‌కిన్ గ్రామములోని ట్రంగు ట్రాక్, ట్రంగుని అను సోదరీమణులిద్దరు గోరిల్లా సైన్యాన్ని నడిపారు. ఈ వీరనారీమణుల నాయకత్వాన ఒకమాసము రోజులలో 60 పట్టణములు శత్రువుల బారి విముక్తి పొందినవి. ఆఖరుకు వీరు శత్రువుల మాయోపాయాలవల్ల ఓడిపోయి గౌరవమర్యాదలు కాపాడుకొనే నిమిత్తం 'డే' అను నదిలోపడి చనిపోయారు. వీట్‌నామ్ దేశీయులు తమ జాతియొక్క వీర నారీమణుల స్మృతిచిహ్నాలను 'డే' నదికట్టమీద నిర్మించారు. నేడు వీట్‌నామ్‌లో వేలకొలది ట్రంగుట్రాక్స్ ట్రంగునాలు జన్మించారు. ఇటీవలన జరిగిన స్వతంత్రపోరాటములను చూచినయడల ఈ విషయము నిజమని గోచరిస్తుంది.

యూరపులో 1940 వ సం ॥ లో ఫ్రాన్సుదేశము జర్మనీకి లొంగిపోయినప్పుడు ఇండో చైనా జపానుకు లొంగిపోయెను. ఫ్రెంచి, జపాను ఫాసిజాన్కి వ్యతిరేకంగా వీట్‌నామ్ దేశీయులు నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంటు ఆధ్వర్యాన సంఘటితపడి తమ స్వాతంత్ర్యము కొరకు పోరాడారు.

వీరబాలిక చినామ్‌చరిత్ర: పాతిక సం ॥ బాలిక చినామ్ విప్లవ పోరాటాన్ని నడిపినది. జపాను ఫ్రెంచి సైన్యము క్రూర నిర్బంధ విధానములతో ఈవిప్లవాన్ని రక్తములో ముంచెను. చినామ్ చంపబడెను. కాని వాస్తవంగాఆమె చావనట్లే. ఎందువలననగా ఆమె స్థానంలో నేడు, వేలకొలది స్త్రీలు నిలువబడి పోరాడుచున్నారు. ఫాసిజానికి వ్యతిరేకంగా 4 సం ॥ తీవ్ర పోరాటాలు సల్పి 1945 వ సం ॥ ఆగస్టులో వీట్‌నామ్ ప్రజలు రిపబ్లికును స్థాపించారు. పోరాటపు దినములలో స్త్రీలు ధైర్యసాహసములతో గోరిల్లాలుగా పురుషులతోబాటు పాల్గొని అనేక పోరాటాలలో జయము పొందారు.

జపాను 1945 సం ॥ ఆగస్టులో లొంగిపోయిన తదుపరి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల తుపాకి గుండ్ల సహాయంతో ఫ్రెంచి సామ్రాజ్యవాదులు వీట్‌నామ్ దేశములోనికి అధికారము సాగించటానికి మరల ప్రవేశించారు. రిపబ్లిక్ ప్రభుత్వాన్ని రక్షించటాన్కిగాను ప్రజలు మరల ముందుకొచ్చారు. మహిళాసమితి ఆధ్వర్యాన చిన్నా పెద్దా అనే వివక్షణలేకుండా స్త్రీలంతా గోరిల్లా పోరాటంలో పాల్గొన్నారు. వృద్ధ స్త్రీలు మార్కెట్టులోనికి చేతిబాంబులు తీసుకువెళ్లేవారు. యువతులు కూడా బ్రిటిషు ఫ్రెంచి జపాను సైన్యాలనుండి తమ మానగౌరవాలనుచేడి బాంబులద్వారా రక్షించుకొనేవారు.

గొరిల్లాదళాలు జపాను మిలిటరీ కాన్ సెంట్రేషన్ క్యాంపులలోనుండి ఫ్రెంచివార్ని విడిపించినప్పుడు, ఫ్రెంచివారు హనాయ్‌లో ఉన్న తమ స్నేహితులకు 1946 వ సం ॥ జూలై నెలలో ఈ క్రింది విధముగా వ్రాసారు.

"యువతీ యువకులందరు తమ దేశరక్షణకొరకు ప్రాణాలను అర్పించి పోరాటలకు సిద్ధముగా నున్నారు. అనేకమంది స్త్రీలు తమ ధైర్య సాహసాలను నిరూపించారు. 1945 వ సం॥ మార్చిలో హానాయ్‌లో ఒక యువతి జపాను ఫాసిజాన్కి వ్యతిరేకంగా ప్రజలంతా ఐక్యము కావలసినదిగా మొట్టమొదటిసారి కరపత్రములను పంచిపెట్టినది. ఒకసారి ఒక యువతి బ్రిడ్జికుదగ్గరగా వంగుని ఎంట్రి కాయలకొరకు చూస్తుండగా, జపానువాళ్లు ఆవైపునకు వెళ్లటముచూసి వెంటనే నిలబడి తన టామీగన్‌తో ఏగురి జపానువాళ్లను చంపి మరికొంతమందిని గాయపరచినది."

స్త్రీలంతా సంతోషకరమైన జీవితాలను గృహములను వంటమొదలైన పనులను వీడి దేశస్వాతంత్ర్యము కొరకు మృత్యువుని ఎదుర్కోవటాన్నికూడా నిలబడ్డారు. పురుషులు యీ వారాంగనలను గౌరవించటయే గాక, ఎంతో గౌరవప్రేమను చూపించుచున్నారు.

1946 వ సం॥ లో ఫ్రెంచి ప్రభుత్వము ఇండో చైనాలో కీలుబొమ్మ ప్రభుత్వాన్ని స్థాపించినప్పుడు సభ్యురాలైన యువతి కీలుబొమ్మ ప్రభుత్వానికి సహాయముచేసి ఒక దేశద్రోహిని చంపినది.

యీరోజున వీట్‌నామ్ దేశములో జరిగే స్వతంత్ర పోరాటము లన్నిటిలోను స్త్రీలు వార్తాహరులుగా గొప్పసేవ చేస్తున్నారు. ప్రమాదకరమైన పరిస్థితులలోకూడ శత్రుప్రదేశాలలో నుండి కూలీలుగా వేలకొలది మైళ్లు రహస్యదారులలో మారువేషములతో నడచి రహస్య ప్రజానాయకుల సందేశాలు స్త్రీలు ధైర్య సాహసములతో ప్రజలకు అందచేస్తున్నారు.

టాన్‌కిన్‌లోని స్త్రీల మిలిటరీదళం, పురుషుల మిలిటరీదళంతో సమానంగా పోరాటము జరుపుచున్నది. హానాయ్‌నుండి ఒక వార్తాపత్రిక యీక్రింది విధముగా వార్తను పంపినది.

"వీట్‌నామ్ స్త్రీలు కేవలం స్వాతంత్ర పోరాటములో పాల్గొనుచున్నారు. డెమొక్రటిక్ ప్రభుత్వం అధికారములోనికి రాగానే స్త్రీలు పురుషులు సమానమేనని" ప్రకటించినది. స్థానికశాఖలలో స్త్రీలు ఎక్కువ పాత్రను వహించుచున్నారు. 1946 వ సం॥ జనవరినెలలో జరిగిన ఎన్నికలలో ఓటుచేసినవారిలో పురుషులతోబాటు స్త్రీలుకూడా సమానముగానున్నారు. ప్రభుత్వము నిరక్షరాస్యతకు ప్రతికారంగా ప్రచారము చేసినప్పుడు 400 మందియువతీ యువకులు ఉపాధ్యాయులుగా పనిచేసేవారు. ఒక సం॥ లో దేశమంతటా అరవైవేల శిక్షణాతరగతులు ఏర్పరచబడెను. లక్షలాది యువతీ యువకులు యీ అధ్యయన తరగతులకు హాజరైనారు.

ఉద్యోగాలలోను ప్రభుత్వ నిర్వహణ మొదలైనవాటిలోను స్త్రీలు పురుషులతోబాటు సమానమైన హక్కులను అనుభవించుచున్నారు.

వీట్‌నామ్ స్త్రీలు తమదేశ స్వాతంత్ర్య పోరాటముయొక్క ప్రాముఖ్యతను గుర్తించారు. అందువలన దేశరక్షణకొరకు తమ భర్తలు, బిడ్డలు, తాముగాని ఆహుతి అగుటకు వెనుదీయకుండా ముందుకురుకుచున్నారు. ప్రపంచములో తాము ఒంటరివాళ్లము కాము అని తెలుసుకొన్నారు. అందువలననే వీట్‌నామ్ స్త్రీలు ప్రజాస్వామ్య ప్రపంచము వైపునున్న, ముఖ్యంగా ఆశియాప్రజలు తమప్రక్కన నిలబడి యీరక్తపిపాస యుద్ధాన్ని ఆపి, ప్రజాస్వామ్య స్వాతంత్ర్యమును రక్షించుటకు సాయపడవలసినదిగా కోరుచున్నారు.

# బిటా కేఫిన్

(తలనొప్పి బిళ్ళలు)

అన్నినొప్పులను, జ్వరములను కుదుర్చును.

తలనొప్పి, పంటినొప్పి, కాళ్ళనొప్పి, నిద్ర లేకుండుట, కీళ్ళనొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును. వాడుకొనువిధము పొట్లములోనుండును. పొట్లం 3 బిళ్ళలు 1 అణా.







## బిటాలాక్స్ (చాక్లెట్ భేదిబిళ్ళలు)

సుఖవిరేచనౌషధము

సుఖవిరేచనము కలిగించి మల బద్ధమును పోగొట్టి మంచిజీర్ణశక్తి నిచ్చును. పొట్లం 2 బిళ్ళలు 1 అణా. అన్నిచోట్ల దొరకును.

స్టాకిస్టులు:—

**దాదా అండ్ కంపెనీ,** పి. టి. మద్రాస్.

తయారు చేయువారు:

**Bombay Tablet Mfg, Co.,**
**Post Box 2092 :: BOMBAY 2.**

# ఉజ్వలమైన సతీత్వము



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## గర్భాశయరోగ నివారిణి.

**అరుణ** ఋతు దోషములను పోగొట్టి పరిపూర్ణ స్త్రీత్వమును ప్రసాదించగల స్వయం సంపూర్ణమగు ఔషధము. అట్టిదానిని విడువక సేవించినట్లయితే. మిమ్ము ఆరోగ్యవంతులను జేయుటయేగాక మీ జీవన పరమావధి యగు ఆనందా నందమును తప్పక యొసగును.




**ఆయుర్వేదాశ్రమం, లిమిటెడ్**
**టి-నగర్. . మద్రాసు.**

EASTERNS 378

# బాతాఖానీ.

‘సుశీలక్కా. ఏమిటి చదువుతున్నావు?

‘రా, కమలా. ఇది ‘గృహలక్ష్మి’ అనే స్త్రీల మాసపత్రిక. ఈమధ్య నీవుఎక్కడా కనిపించటం మానేశావే?’

‘రాట్నంమీద నూలుతీయడం మూలంగా మీయింటికి రావటంలేదు, అయినా వారంరోజులేకదా అక్కా నీకనిపించి’

‘నేనే వద్దామనుకుంటున్నాను నీదగ్గరకు కాని రాట్నం వడుకుతున్న మూలంగా తీరికలేదు. అన్నట్లు ఈపత్రిక నీవు చూశావా? ఈ ‘గృహలక్ష్మి’ స్త్రీలనుగురించి ఎంతసేవ చేస్తున్నదో చూడు. ఎంతతెలియని పల్లెటూరి స్త్రీలకయినా తెలిసేలాగు సులభమార్గాలతో చక్కగా విజ్ఞానాన్ని బోధిస్తోంది.

‘నీవు చదివినతరువాత నాకొకసారి ఇవ్వు అక్కా. నేనుకూడా చదువుకుంటాను, అసలు నీకు ఈ ‘గృహలక్ష్మి’ పత్రిక ఎట్లా వచ్చిందక్కా?,

‘ఇదె మాస్నేహితురాలు సరళ అనే అమ్మాయి కాకినాడలో చదువుకుంటోంది. మొన్న నన్ను చూడటానికి వస్తూ ఈ ‘గృహలక్ష్మి’ తీసుకువచ్చి చదువుకొనమని నాకు ఇచ్చి ‘సుశీలా ఈపుస్తకం నీవుస్వయంగా చదివి అర్థంచేసుకుని నేనుమళ్ళ నిన్నుచూడటానికి వచ్చేసరికి నీవుకూడా ఈ గృహలక్ష్మి వలెనే తయారవాలని’ చెప్పింది. ఈపుస్తకం నీకు చూపించటానికి నేను ఇప్పుడే మీయింటికి వద్దామనుకుంటుంటే ఇంతలో నీవువచ్చావు,

‘ఈ పత్రికచాలా బాగుందక్కా. ఇదిమాస పత్రిక అని దీనిమీద వుంది కదా, ప్రతినెలా మనం చదువుకోటానికి ఇది ఎట్లా దొరుకుతుందో ఆసరళను అడిగితెలుసుకొన లేకపోయావా? ప్రతినెలా మనంకూడా తెప్పించుకుందామక్కా!’



గాయని: శ్రీమతి అల్లూరి అన్నపూర్ణాదేవి,

‘పిచ్చికమలా!’ ఇటువంటి పత్రికచూచి వివరం తెలుసుకోకుండా వూరుకుంటానా! వెంటనే తెలుసుకున్నాను. దీనిఎడ్రసు ఇది: డాక్టర్ కే. యన్. కేసరిగారు - కేసరి కుటీరం లిమిటెడ్, రాయపేట, మద్రాసు అని వ్రాసి చందా డబ్బు పంపిస్తే ప్రతినెలా తప్పకుండా పత్రిక మనకు పంపిస్తారు, కేసరిగారు ఆడవాళ్ళకొరకై ఈపత్రికను అనేక వ్యయ ప్రయాసలకు, ధనవ్యయమునకు ఓర్చి స్వలాభం

చూచుకొనకుండా స్త్రీలలో విజ్ఞానం కలుగచేయాలనే వుద్దేశ్యంతో నడుపుతున్నారు. మనంకూడా ప్రతి నెలా 'గృహలక్ష్మిని' తెప్పించుకుని చదువుకుందాము.'

'ఈ 'గృహలక్ష్మి'కి సంవత్సరంచందా ఎంతవుంటుందక్కా!'

'చూడు, కమలా! దానిమీదేవుంది, సంవత్సరానికి చందా 4-8-0 అవుతుంది, మనమిద్దరం కలిసి తెప్పించుకుందాము'

'ఈ గృహలక్ష్మి ధనిక స్త్రీలకే కాకుండా బీద స్త్రీలకుకూడా అందుబాటులోవుండి ధనికబీద వివక్షత లేకుండా ప్రతిగృహలక్ష్మి రాణిగావుండాలనే అభిప్రాయంతో కేసరిగారు చందా తక్కువగా పెట్టారు. చూచావా ఆయన ఉదార స్వభావము.'

' అవునక్కా డబ్బుతీసుకు వస్తాను మాఆయన నడిగి. ఇవేళ్లే మనం చందాకడదాము నావంతు 2-4-0- తీసుకువస్తా నీవే కట్టు'

' నేనే కడతానుకాని, కమలా మీఆయన ఈచందా కట్టటాన్కి ఏమంటారో? ముందుఆయన వుద్దేశం తెలుసుకో, తర్వాత కడదాం'

' అక్కా! బావబుద్ధి ఎట్టాటిదోకాని, మావారిబుద్ధిమాత్రం అటువంటిది కాదుసుమా! ఇదివరకు ఎన్నోసార్లు 'గృహలక్ష్మి' ఆడవాళ్ళపత్రిక వెలువడుతోంది తెప్పిస్తాను, నూలువడుకునే సమయంలో నూలువడికి, తీరికసమయంలో అది చదువుకొన మనేవారు. ఆపత్రిక నేనెప్పుడూ చూడక బాగుండదనే వుద్దేశ్యంతో వద్దనేదాన్ని. ఇప్పుడు స్వయంగా చూడ్డంతోనే తెప్పించాలని నాకే బుద్ధిపుడుతోంది. ఇలా తెప్పించి చదువుకుంటున్నామంటే ఆయన ఎంత సంతోషిస్తారనుకున్నావేమిటి అక్కా'

' నిజానికి ఏపల్లెటూరి చదువో ఈకాస్త చదువు వుండబట్టికదా ఇటువంటి చక్కటివిషయాలు తెలుసుకోగల్గుతున్నాము. ఈమాత్రంచదువు కూడా మనకు లేనట్లయితే ఈవిషయాలు మనకుతెలియవు, పైగా మనభర్తలు చదువుకున్నారు కనుకసరిపోయిందిగాని, చదువుకోని మన శ్యామలభర్తలాగే అయితే 'ఈపత్రికలేమిటి ఈచదువులేమిటి' అనికేకలేసేవారేమో'

' అసలు చదువుకోనివాళ్ళు తెలియక ఏడుస్తుంటే మనం చదువుకొనికూడా వాళ్ళతోసమానమవుతున్నాము, చూశావా, పాపము! ఆశ్యామల బి-ఏ-వరకు చదివి ఏమిలాభం? పొట్టచించినా అక్షరంముక్క లేనివాడికిచ్చి పెండ్లిచేశారు. ఇప్పుడు దాని అవస్థ పుస్తకంచూచేసరికి వచ్చి లాక్కుని పొయిలో పెట్టేస్తాడట ఆస్తివుందికదా యని దాని గొంతుకోసి ఆమృగానికిచ్చి పెండ్లిచేశారు. ఇటువంటివి చదవాలని ఆశ్యామల కెంత సర్దా అనుకున్నావు. సరళ మనకు ఈ 'గృహలక్ష్మి'ని తెచ్చియివ్వటం ఎంతమేలు చేసిందో. మనము ఈ పుస్తకం చూడట్లనయితే ఇదివరలాగే ఉన్నచదువుకూడా పాడుచేసుకుందుము.'

'అక్కా! అనేకమంది మనతోటిసోదరీమణులు పుస్తకం చూడక ఇదివరకుచదివిన చదువుకూడా మరచిపోయారు. కొంతమంది చిన్నచదువు చదివినా శ్రద్ధగా ఇటువంటి పత్రికలన్నీచూచివృద్ధిచేసుకున్నారు చూడు, వేమన్నగారు ఏమన్నారో 'సాధనమున పనులు సమకూరుధరలోన' అని.'

'అవును కమలా! చాలా సేపయింది. రాట్నంమీద నూలుతీసుకుంటూ చదువుకుందాము. వృధాగా మాటలతో కాలం గడపినందువలన ఏంప్రయోజనముంది? ఏ స్త్రీ యింటికొక రాట్నం పెట్టి వడుకుతూ 'గృహలక్ష్మి' చదువుతూ వుంటుందో, అదే గృహానికి కళ. అదే నిజమైన భారతీయ గృహలక్ష్మి. మరిశలవు, కమలా"

"నేను వస్తానక్కా"

సోదరీ మణులంతా కమలా, సుశీలల వలెనే ఇటువంటి 'గృహలక్ష్మి'ని చదివి దానిలో మంచి చెడ్డలు గ్రహించి, దానినే పెద్దచదువుగా వృద్ధిచేసుకొని, నిజమైన గృహలక్ష్ములవలె తయారవుతారని ఆసిస్తున్నా.



# రాట్నప్రశంస

'గృహలక్ష్మి'లో 'నవోదయము' అనుభాగమందు, కొంచెం రాట్నపు ప్రశంసవున్నది. చదివితిని. నాఅనుభవములోని విషయాలు తెలుపుతాను. నాపేరు బృంద - వయస్సు 14, మాతండ్రి ఎలిమెంటరీ స్కూలు హెడ్మాష్టరు, ఎమ్మిగనూరులో నున్నాము. మాతండ్రిది కుచేలసంసారం-తినేవాండ్లము ఎనిమిది మంది-తెచ్చేదిఒక్కడూ. అదైనా ఎంత? 24+16=40 రూ. నెలకు. ఈ కాలంలో ఈ అల్పాదాయముతో బ్రతుకగలమా? నెల నెలకు లోటే-అన్నపుడు బ్రతుకుతెరవేది? వేరే వరమానమా- లేదాయె; భూమి, ఇండ్లా లేవాయె; ఏమిచేసేది? మానాయన 21 వ, సంవత్సరంనుంచి, రాట్నము వడికేవాడు-మాతల్లిగారూ నేర్చినారు. మేము ఆడబిడ్డలము. నేనూ, నాచెల్లి సరస్వతి, మాతమ్ముడు, ప్రాణేశ, వడికేది నేర్చినాము. ప్రతియొకరు దినానికి 840 గజాలు చిట్టీ తయారుచేసే తీరాలి. ఇది ఇంట్లోరూలు. కనీసం ఇంట్లోని వారంతాచేరి 5 చిలపలు వడకాలి. వాటిని చరకా సంఘానికి తీసికొనివెళ్లి ఇచ్చేది. బట్టకొనేది, ఎక్కువైన డుడ్డుతెచ్చేది, జరుగుతూంది. మా బీదకుటుంబానికి రాట్నము కామధేనువైనది. ఎక్కువ వరమానము నెలకు సరాసరి 15-0-0 రూ. దొరుకుతుంది. ఇంట్లోనే నీడలోకూర్చొని అవలీలగా చేసేపని. ఇది వర ప్రసాదము. ఎన్నోకుటుంబాలకు ఆధారం, ఈ గుడ్డల కరవుకాలంలో అందరు వడకవలిసిందే.

బృంద

# సోవియట్ శిశురక్షణాలయాలు ★



—శ్రీమతి జయంతి, బెంగుళూరు.

"రష్యన్లు వాళ్ల పిల్లలను 'జీవిత కుసుమాలు' అని పిలుస్తారు. వాళ్ల వికాసానికి సర్వాన్ని వినియోగిస్తారు." [మిసెస్ సెసిల్ చెస్టర్‌టన్ సెల్యూట్ ది సోవియట్ అనే పుస్తకంలో.]

పసిపిల్లల విలువ దేశసౌభాగ్యాలలోకెల్ల ఎక్కువ అమూల్యమైందని సోవియట్ దేశం గుర్తించినంత పరిపూర్ణంగా ప్రపంచంలో మరే దేశము గుర్తించలేదు. విద్య పుట్టుకతోనే కాకుండ, పుట్టుకకు పూర్వమే ప్రారంభమౌతుందని, శైశవంలో పిల్లలకిచ్చే క్రమమైన తర్ఫీదుమీదనే ప్రయోజన సమర్థత, ఎక్కువ భాగం ఆధారపడి ఉంటుందనే సత్యాన్ని, సోవియట్ రష్యా అనుసరించినంత సంపూర్ణంగా మరే దేశమూ అనుసరించలేదు. అందువల్ల శిశు రక్షణాలయాలు, శిశు పాఠశాలలు స్థాపించి, నడిపించటానికి మనం సోవియట్ రష్యానుండి ఎన్నో పాఠాలు నేర్చుకోవలసి ఉన్నది.

"క్రెచీ" లనే శిశు రక్షణాలయాలు, శిశు సంరక్షణలో చాలవరకు ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. 15 మాసాల లోగడనున్న పిల్లలకు "క్రెచీ" పోషణాలయముగా ఉంటూ ఉన్నది. శిశు పాఠశాలలు 5 లేక 6 సంవత్సరాలవరకు ఉన్న పిల్లలకు ఉద్దేశింపబడి ఉన్నాయి. శిశు పాఠశాలలు వేరువేరు రకాలుగ దేశమంతటను వ్యాప్తి జెంది ఉన్నాయి. పగటి పాఠశాలలు, రాత్రి పాఠశాలలు, బోర్డింగ్ పాఠశాలలు ఉంటాయి. పగటి పాఠశాలలకు ఖర్చు తక్కువ, ఎక్కువ ప్రఖ్యాతిగా ఉంటున్నాయి. పిల్లల మానసిక, శారీరకాభివృద్ధికి ఇవి ఎంతో తోడ్పాటుగా ఉంటున్నాయి. బోర్డింగ్ పాఠశాలలు ప్రస్తుతం తల్లిదండ్రిలేని పిల్లలకు, అనాధ శిశువులకు ప్రత్యేకించబడినాయి.

ఈ శిశు రక్షణాలయాల ఆర్థిక పరిస్థితులు (1) స్టేట్ బడ్జెటు (2) లోకల్ బడ్జెటు (3) స్టేట్ సోషల్ ఇన్సూరెన్సు ఫండు (4) పారిశ్రామిక, వ్యవసాయక ప్రదర్శనాలమూలకంగా వచ్చే ఆదాయము, సహకార సంఘాలు, తల్లిదండ్రులు తమ తమ పిల్లల సంరక్షణార్థం ఇస్తూ ఉండే నిర్ణీత విరాళాలమీద ఆధారపడి ఉంటాయి.

శిశు రక్షణ, విద్యకు అవసరమైన ఉపకరణాలు చాల ప్రముఖ పాత్ర వహిస్తాయి. వలసిన వస్తు సామగ్రి, దుస్తులు, వైద్యసరఫరాలు, సంగీత వాయిద్యాలు, ఆటవస్తువులు, ఇలాంటి అవసరాల సరఫరాకు ఎక్కువ జాగ్రత్త తీసికోబడుతూఉంది. మేజాలు, కుర్చీలు, పడకలు, పిల్లల రకరకాల ఎత్తులనుబట్టి ఉపయోగింపబడుతున్నాయి. ఆట బొమ్మలు

చురుకైన ఆటలను ప్రోత్సహించేటివిగాను, బలాన్ని నేర్పరితనాన్ని పెంపొందించేటివి గాను ఉంటాయి. అవి ముఖ్యంగా మాతృత్వాన్ని, శైశవాన్ని పోషించడానికి ఉద్దేశింపబడుతున్నాయి. సృష్టించడానికి, నటించడానికి అనువైన ఆట బొమ్మలుకూడ ఉంటాయి.

ఈ శిశు పాఠశాలల్లో ముఖ్యమైన సమస్య పిల్లల ఆరోగ్యం. మంచి అలవాట్లు, నడవడికలు కలిగి, ఆదర్శ వ్యక్తులుగ తయారు చేయడానికి, పిల్లల శారీరక, మానసిక, సాంఘికాభివృద్ధికి ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసికోబడుతాయి. విద్యచాలవరకు ఆటల ద్వారానే నేర్పించబడుతూ ఉంది. స్వేచ్ఛగా తమకు తామే ఆడుకో కలిగే ఆటలు, పందెములు, ఆటవస్తువులు, బొమ్మల సహాయంతో ఆడుకో కలిగే ఆటలు వ్యక్తిగతమైన ఆటలు, సహకారమైన ఆటలు, యింటిపందెములు, బయటిపందెములు ఇలాంటి రకరకాల ఆటలు ముఖ్యంగా పిల్లల దైనందిక కృత్యాల ననుసరించి ఉంటాయి. శిశు విద్య ముఖ్యాశయాలలో మంచి అలవాట్లు నేర్పించడం ఒకటి. నిద్ర, భోజనం, దుస్తుల విషయంలోనే కాకుండ సాంఘిక, శ్రామిక విషయాల్లోకూడ క్రమపద్ధతి నేర్పించబడుతుంది. దైనందిక జీవిత సమస్య అన్నిటికంటె ముఖ్యమైనదిగా పరిగణింపబడుతూ ఉంది. సంగీతం విద్యా విధానంలో ఎక్కువగ ఉపయోగింపబడుతూ ఉంది.

పగటి పాఠశాలల్లో పిల్లలు ఉదయం 7-30 గంటలనుండి సాయంత్రం 5 గంటల వరకు ఉంటారు. మధ్యాహ్న భోజనం, టిఫను వాళ్ళకు సరఫరాచేయబడుతుంది. పాఠశాలకు రాగానే అవసరమైతే పరీక్షచేసి, వైద్య చికిత్సలుచేస్తారు. వెంటనే స్నానాలు చేయిస్తారు. ఎవ్వరి సహాయము లేకుండ తమకు తామే ఆడుకో కలిగే ఆటలకు, పనులకు వదలపెడతారు. 8-30 గంటలకు బలాన్ని కలుగజేసే ఆహారం యిస్తారు. తర్వాత కొంత సేపటివరకు చేతిపనులు నేర్చుకుంటారు. తర్వాత వాహ్యాళికి బయటికి తీసుకవెళ్లుతారు. నడచి రాగానే భోజనం. మధ్యాహ్నం దాదాపు మూడు ఘంటలసేపు నిద్రబోతారు. నిద్ర లేవగానే స్వేచ్ఛగాచేసికోగలిగే పనులు, ఆటలు ఉంటాయి. అల్పాహారం తీసికోగానే మళ్లీ షికారు. సాయంత్రం స్నానాలు చేయించడం యిండ్లకు పంపివేయడం.

ఆటల ద్వారా, పనుల ద్వారా పిల్లలు సాంఘిక విద్యలో ప్రథమ పాఠాలు నేర్చుకుంటారు. ఈ విద్యయొక్క ముఖ్యోద్దేశం సర్వమానవ సౌభ్రాతృత్వం ఈ ఆదర్శాన్ని సాధించడానికి ముఖ్యసాధనం సాంఘిక జీవిత విధానమే. సమవయస్కులైన తోటి వ్యక్తులతో దినదినము జీవిస్తూ ఉండడంవల్ల తోటి మానవ క్షేమానికిచేసే కృత్యాలలో వారి వారి ధర్మాలను నెరవేర్చడానికి వలసిన క్రమశిక్షణ, ఆదర్శాలు పొందకలుగుతారు.



మహాత్ముఁడు భంగీ కాలనీకి వెడుతున్న దృశ్యము.

# గిరిజ





రచయిత: కుప్పిలి భాస్కరరావు.

"అమ్మా! అమ్మా!"

"........................"

"అమ్మా! నాకు కొత్తబట్టలు కొనియ్యవే! గిరిజకు వాళ్ళనాన్న రంగురంగుల పువ్వులగౌను కొనిచ్చారే ...... మరినాకు కుట్టించవూ?"

"గిరిజ, వాళ్ళనాన్న గొప్పవాళ్ళమ్మా! మనం పేదవాళ్ళం... మనకు అవన్నీ ఎలాగ వస్తాయ్! వెళ్ళి చదువుకో!"

వసంతుడు మారుమాటాడకుండా వెళ్ళిచదువు కుంటున్నాడు. ఇంతలో చెంగుచెంగున గెంతుకుంటూ గిరిజ వచ్చింది.

"వసంత్! నాకు మానాన్నమంచిగౌను తెచ్చారు ...చూశావా, ఎంచక్కా వుందో!"

వసంతుడు మాటాడలేదు. దీక్షగా చదువుకుంటున్నాడు గిరిజ వైపు చూడకుండా.

"ఏం వసంత్! కోపం వచ్చిందా? ... చూడూ!" అంటూ గిరిజ లడ్డూవుండచూపింది.

వసంతికి నోరూరింది ... చదువునుంచి దృష్టి మరల్చి ఆతృత, ఆశగా చూస్తున్నాడు వసంత్.

"నాజట్టుంటావు కదూ!" అంది గిరిజ

"ఊఁ!"

"మరి ఒట్టెయ్"

గిరిజ చేతిలో వసంత్ చెయ్యివేసి ఒట్టు పెట్టుకున్నాడు.

"అయితే ముక్కలు చేద్దాం! ...నువుచెయ్." అని గిరిజ లడ్డూ వుండను వసంత్ కిచ్చింది. వసంత్ నోటితో లడ్డూని రెండుముక్కలు చేసి ఇద్దరూ పంచుకున్నారు.

"వసంత్! నా మీద నీకు ఎందుకోకోపం వచ్చింది.?"

"మా అమ్మ మీరుగొప్ప వాళ్ళు, మేం నిరుపేదలం" అని చెప్పింది.

"అయితే?"

"నీకు మీనాన్న కొత్తగౌను కుట్టించారుకదూ? మరేం మా అమ్మని నాకు కూడ కొత్తది కుట్టించమని అడిగా"

"ఒస్ ఇంతేనా?"

"మేం నిరుపేదలం, మాకు కొత్తబట్టలు ఎలాగొస్తాయ్?"

"వుండు - మా నాన్నని అడుగుతా నీకు కూడా కొత్తవి కుట్టించమని"

"వొద్దు గిరిజా! మా అమ్మ కొట్టేస్తుంది. నాకు కొత్తవి అఖ్కర్లే"

"పోనీలే వసంత్! నేనంటే కోపమా?"

"కాదు గిరిజా! నువ్వంటే నాకెంతో ఇష్టం!"

కొళాయినించి బిందెతో నీళ్ళు పట్టుకు వచ్చింది లక్ష్మి. అప్పటికి గిరిజా వసంత్‌లు గుసగుస మాట్లాడుకుంటున్నారు. లక్ష్మి నివ్వెరబోయి ఇద్దర్నీ చూస్తోంది.

"ఏంరా వసంత్! ఇదేనా నీచదువు? ఇలాగయితే మనం బాగుపడతాంలే! గొప్పవాళ్ళతోనా స్నేహం? అందులోను ఆగిరిజ భాగ్యవంతుల పిల్ల అని నీకు తెల్సునా? వాళ్ళతో మనం స్నేహం చెయ్యకూడదు. బీదవాళ్ళని చూస్తే భాగ్యవంతులకు అసహ్యం. మీరిద్దరూ ఇలా వుంటున్నారని వాళ్ళ నాన్నకు తెలుస్తే ఈ కొంపలో అసలే వుండనివ్వరు జాగ్రత్త!" అంటూ కటాయించింది లక్ష్మి. గిరిజ గప్ చిప్‌గా జారిపోయింది!

1

రాఘవరావు వాలుకుర్చీలో కూర్చుని డైలీ న్యూస్ పేపరు చదువుకుంటున్నాడు. అతని దగ్గిర అతని భార్య లేసు అల్లుకుంటోంది. రాఘవరావు ప్రక్కను గిరిజ నిల్చొని వుంది.

ఏం గిరిజ! నిల్చున్నావ్? దా!" అంటూ రాఘవరావు గిరిజను పైకి లాక్కున్నాడు.

"నాన్నా! వసంత్ వాళ్ళు బీదవాళ్ళటగా" అంది గిరిజ.

"అవునమ్మా! వాళ్ళు బీదవాళ్ళే"

"పాపం, ... నాన్నా! వసంత్ మంచివాడుకదూ? అయితే వాళ్ళమ్మ ఎప్పుడూ కొడుతుండే వసంత్‌ని. మనం భాగ్యవంతులమట. బీదవాళ్ళంటే భాగ్యవంతులకు అసహ్యమట నాన్నా! నాతో స్నేహం చెయ్యొద్దని వసంత్‌ని కొడుతూంటుంది వాళ్ళమ్మ ... ఎప్పుడున్నా - చూశావా మరి? వసంత్ ఎంత మంచివాడనుకున్నావ్?"

"ఏయ్ గిరిజా! ఆపేదవాళ్ళతో నీకేమిటే! ఈ సంబంధం? నువ్వు ఇంట్లో వుండలేవ్? వాళ్ళింటి కెందుకు వెళ్తావ్?" అని దబాయించి కోపంతో మందలించింది విమల.

"వసంత్‌తో ఆడు కోడానికమ్మా! లేకపోతే నాకేమవుసరం వాళ్ళింటికి వెళ్ళడానిక్కి?"

"చాల్లే వాడితో ఆటలేమిటి నీకు? ఇకముందు వాళ్ళింటికి వెళ్ళావంటే చూడు ఏంచేస్తానో" అంటూ వార్నింగిచ్చింది కుమార్తెకు రాఘవరావు భార్య విమల.

గిరిజా వసంత్‌ల ఇళ్ళు ఒక పక్కనే వున్నాయి. వసంత్‌కు ఎనిమిదేళ్ళు, గిరిజకు ఆరేళ్ళప్రాయం ఇద్దరూ అన్యోన్యంగా వుంటున్నారు. కాని వసంత్ నిరుపేద, గిరిజ భాగ్య వంతులబిడ్డ. వసంత్ తల్లి లక్ష్మి పౌరుష వంతురాలు. బీదల పిల్లల్ని హేయంగా చూస్తారని లక్ష్మి గిరిజతో స్నేహం చెయ్యవద్దని వసంత్‌ని హెచ్చరిస్తుంది. విమల తనో శ్రీమంతురాలనే గర్వ స్వభావం కలది. అంచేత గిరిజను వసంత్‌తో స్నేహం

చెయ్యొద్దని కోపించేది. ఇది ఈలా వుండగా రాఘవరావు ఇటు గిరిజను మందలించే వాడు కాదు అటు వసంత్ పేదరికాన్ని చూచి జాలిపడేవాడు కాదు.

పది వసంతాలు గడచిపోయినై ...

ప్రకృతి కాలగర్భంలో ఇదిలెఖ్ఖ లేదు

ఓనాటి వెన్నెలలో ...

ప్రేమజీవులకు శోభనిచ్చేది మనోజ్ఞమైన వెన్నెలే కదా!

ఆవెన్నెట్లో ఇద్దరు ప్రేమమూర్తులు చెరువు గట్టుమీద కూర్చుని సంభాషించు కుంటూన్నారు "నేను నిరుపేదను గిరిజా! నన్ను వలచి నువ్వు ఆజన్మాంతం దుఃఖించ వలసినదే కాని, నీ ఆశఫలించదేమోనని నాకు భయంగావుంది"

"వసంత్! పరిహాసా లాడుతున్నావా? ప్రేమకు పేదా, గొప్పా, జాతి, మత విభేదాల్లేవని నువ్వే అనే వాడివి కాదూ, మరి నీధోరణి ఇలా మారుతుందేం?"

"కాదు గిరిజా! నిన్ను విడిచిపెట్టి ఒక్క క్షణమైనా వుండగలనా? నీసుందర నయనాల్ని ముఖపద్మాన్ని చూస్తుంటే నాజన్మ తరించి పోతుందే!"

"పిచ్చి వసంత్! నానాటికి పిల్లాడివయి పోతున్నావ్. నీవులేనిదే నాకీ జగత్తే లేదనుకో. నేను మాత్రం నిన్ను విడిచి ఒక్క క్షణం వుండగలనా?"

"అంత దయా, అంత దయా గిరిజా! నువ్వు అమృత స్వరూపిణివి సుమా"

"నీజాలిలో నాకు స్థానం కావాలి, నీకను కొలకుల్లో, నీహృదయంలో, నీదేహంలో ప్రతి రక్తనాళంలోను నాకు స్థాన మివ్వాలి. అప్పుడు నీలో లీనమైపోవాలనుంది వసంత్! ... నా కుడికన్ను అదురు తోందే."

"భయం లేదు గిరిజా."

"అబ్బా!" అంటూ గిరిజ చిన్నపిల్లలా వసంత్ కౌగిలిలో వాలిపోయింది.

వెన్నెలలో మేఘాల్లోంచి చంద్రుడు దూర దూరంగా పోతూన్నాడు ...

గిరిజా, వసంతరావులు యుక్తవయస్సులో నున్నప్పుడు జరిగిన సంఘటన ఇది.

వసంతరావు ఇప్పుడు వుద్యోగంలో వున్నాడు. కాని అతని తల్లి చనిపోయింది. అప్పట్నుంచి వసంతరావు ఏకాకిగా వుంటున్నాడు. గిరిజా, వసంత రావుల ప్రేమ దిన దినా భివృద్ధి పొందుతోంది. కాని విధి అలక్ష్యం! ఈ సంఘటన జరిగిన కొద్దిరోజుల్లోనే వసంతరావుకి ట్రాన్సఫర్ అయిపోయింది.

ఆవేళ గిరిజా వసంతరావులు మళ్ళీ సమావేశమయ్యారు—

కామ దృష్టితో కాదు—
పవిత్ర ప్రేమచేత!
కేళీవినోదం కోసంకాదు—
వియోగదుఃఖం చేత!
ప్రేమ ప్రసంగాలకు కాదు,—
ప్రేమ సందేశం కోసం!

ఆవేదనతో దుఃఖానల సంతప్తయై హృదయ భారంతో వసంతరావు ఒళ్ళోపడి గిరిజ వెల వెల పోయి వెక్కి వెక్కి ఏడుస్తుంది. వసంతరావు మాత్రం కరుగక పోలేదు అయినా అతను పరిస్థితులకు బద్ధుడు కావలసిందే!

"నువ్వు ఇంకా అమాయకత్వంలో, అజ్ఞానంలోనే వున్నావా గిరిజా! నీకు, నాకు ఇదే కడసారి సమావేశం. ఇదేశాశ్వతమైన ఎడబాటు. ఇక నీవు ఎవరికో భార్యవు కాబోతున్నావు, నాపై ఆశ వదలుకో గిరిజా!" ఎంతో ఖేదంతో వసంతరావు గిరిజను ఈ విధంగా ఓదార్చబోయాడు. కాని గిరిజ దుఃఖం ద్విగుణీ కృతమైంది!—

"నిన్ను మరచిపోలేను వసంత్! నాజీవితానికి నీవే ఆశాజ్యోతివి. నిన్ను విడిచిపెట్టి వుండలేను వసంత్!" అంది గిరిజ అరిచేతుల్లో ముఖంకప్పుకొని ఏడుస్తు.

"చూడు గిరిజా! పవిత్రమైన మనప్రేమ ఇలా ఎప్పుడూ అవిఛిన్నంగా వుండవలసిందే! నువ్వు విచారించి ప్రయోజనంలేదు." అంటూ ఆమె కన్నీళ్ళను తనపట్టుతో తుడిచాడు. ఆవిధంగా ఆమె అతని కౌగిలిలో దుఃఖిస్తూ పడిపోయింది.

4

గిరిజకు పెండ్లి అయిపోయింది.........

ఆమెభర్త ఆఫీసులో వసంతరావు హెడ్‌గుమాస్తాగా పనిచేస్తున్నా, ఈవిషయం గిరిజ, వసంతరావులకు తెలియదు.

ఆఫీసర్‌నకు బదిలీ అయిపోయినది......

ఆదినం వసంతరావుని టీకి ఆహ్వానించాడు ఆఫీసర్. వసంతరావు ఎదుట సతీ సమేతుడై కూర్చున్నాడు ఆఫీసరు......

వసంతరావుని చూసి తృళ్ళి పడింది గిరిజ....

వసంతురావు గిరిజనుచూసి నిర్ఘాంత పోయాడు.... అతని హృదయంలో హాలాహలం విజృంభించింది.... అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నై....

ఆమె హృదయంలో తుపాను చెలరేగింది... పిడుగుల వర్షం కురుస్తోంది... దావానలం వ్యాపించింది.... ప్రపంచం దద్దరిల్లి పోతుంది.

గిరిజ నిశ్చేష్టయై పోయింది!

వసంతరావు దిగులుగా ఆకాశంవైపు చూస్తున్నాడు!

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

"ఒంట్లో బాగాలేదా?" ప్రశ్నించాడు ఆఫీసరు.

"Excuse Me" అని మాత్రం అనేసి గిర్రునతిరిగి పోతున్న తలతో ఇంటికి వచ్చేసాడు. వసంతరావు తలనొప్పితో...

గిరిజకు వివాహమై సంవత్సరమై పోయింది. ఆమె ఇష్టంపైనా?- కాదు, బలాత్కారంగా!

ఆమె కన్నీరు వరదలై పారింది....

కాని, విధిలేక ఒప్పుకోక తప్పిందికాదు. తను బ్రతికి వుంటే తన ప్రియుని తనజీవితకాలంలో గాంచ లేకపోతానా అని ఆశ!

ఆనాడు వసంతరావును చూసి నిశ్చేష్టయై పోయింది గిరిజ... వసంతరావు కూడా మారు మాటాడ కుండా వెళ్ళిపోయాడు. వీరిద్దరి వైఖరి చూసి గిరిజ భర్త కలత చెందాడు, అనుమానించాడు.

గిరిజ హృదయం తీవ్రమైన విఘాతాన్ని పొందింది. ప్రబలమైన వుష్ణంతో మంచమెక్కింది. నయ మవుతుందా?-లేదు!-

గిరిజ తలిదండ్రులు, విమల రాఘవరావులు వచ్చారు-

ఆమె బాధను నివారింపజేయగలిగారా?-లేదు!

ఆమె ప్రియుడు-ఆమె ఆశాజ్యోతి ఒకసారి ఆమెకు కనిపించాలి, నోరారా "గిరిజ" అనాలి. అంతే ఆమెకు కావలసింది. తను తన ప్రియుడికి ద్రోహంచేసినందుకు క్షమాపణ వేడుకోవాలి. అదే తనకు కావలసింది!

తీవ్రమైన జ్వరబాధతో వసంతరావు మూల్గుతూన్నాడు-

ఇక్కడ వసంతరావు, అక్కడ గిరిజ ఇద్దరూ ఒకే అవస్థలో నున్నారు. ఇద్దరూ ఒకే సమస్యను ఎదుర్కొన్నారు.

డాక్టర్ వచ్చాడు...వసంతరావువైఖరి చూశాడు... ప్రబలమైన శిరోవేదనతో వసంతరావు పలవ రిస్తూన్నాడు.

"మోసం చేస్తావా గిరిజా! నన్ను మోసం చేస్తావా?...అంత దయా, అంత దయా గిరిజా! నువ్వు అమృత స్వరూపిణివి గిరిజా!"

డాక్టర్ మందిచ్చిపోయాడు...

ఆ దినమే, గిరిజను కూడా చూడటం తటస్థించింది. గిరిజ కూడా ఇదేస్థితిలో వుంది. కాని గిరిజ ప్రాణాపాయ పరిస్థితిలో వుంది.

"మోసం చేశాను వసంత్! నీకు చాలా ద్రోహంచేసాను... నమ్మించి మోసంచేశాను. నన్ను క్షమించవు వసంత్, ఈ అభాగ్యురాలను క్షమించవూ? ఒక్కసారి నీసుందర ముఖపద్మాన్ని చూడనివ్వవూ? వసంత్!వసంత్!"

డాక్టర్ ఖంగారు పడ్డాడు...

"చాలా ప్రమాదవస్థలో వుంది. ఇదే అవస్థలో వెనుక వీధిలో వసంతరావు కూడా కలవరిస్తు న్నాడు. ఆ అబ్బాయిని ఈమెకు కనపరచనిదే ఈకలవరింత తగ్గదు." అనిచెప్పి డాక్టర్ వెళ్ళిపోయాడు.

వెళ్లిపోతూ-"దీనికి మందులేదు. నేను అదృష్టవశాత్తు ఈవిషయాన్ని కనుక్కో గలిగాను. ఆ అబ్బాయి కనుపడే వరకు ఈమె ఈలానే వుంటుంది." అని చెప్పి డాక్టర్ మరీ వెళ్ళిపోయాడు.

గిరిజభర్త వేణుగోపాలరావు ఈ సారి తన అనుమానాన్ని చంపుకున్నాడు...

వేణుగోపాలరావు పూర్తిగా మారిపోయాడు.... గిరిజను ప్రియసోదరిగా భావించాడు....

గిరిజ పరితాపాన్ని కండ్లార చూడలేక పోయాడు. అతని హృదయం ద్రవించి పోయింద్ది. గిరిజా, వసంతుల ప్రేమబంధాన్ని కప్పిపుచ్చి, ఈవిషయాన్ని తనకు తెలియకుండా దాచి ఆమెను తన కిచ్చి బలవంతపు పెండ్లిచేసి, ఆమెనీస్థితికి తెచ్చిన ఆత్తమామలను దూషించాడు. రాఘవరావు పశ్చాత్తాప పడ్డాడు. విమలకు జ్ఞానోదయమైంది. అందరూ వసంతరావుని క్షమాపణ కోరాలని వసంతరావు ఇంటికి వచ్చారు.

తనకోసం గిరిజ పలవరిస్తూన్నట్లుగా వసంతరావు వినగానే సంతోషంతో గిరిజను చూడటానికి ఆత్రుతగా లేచాడు. వసంతరావు వచ్చేటప్పటికి గిరిజ ఆఖరు దశలోవుంది.

"గిరిజా! గిరిజా!-"అన్నాడు వసంతరావు ఆమెపైబడి-

కళ్ళు తెరిచింది గిరిజ.

"వసంత్!-" అంటూ కండ్లనీరు పెట్టుకుంది గిరిజ; "వసంత్! నేను మహాపరాధం చేశాను. మహాద్రోహం చేశాను. నాకు శాంతిలేదు వసంత్!"

"లేదు గిరిజా! నువ్వుచాలా గొప్పపనిచేశావు. నీ వుత్తమ స్త్రీ ధర్మాన్ని నీవు ఆచరించావు. నువ్వు నిష్కల్మష హృదయవు గిరిజా"

"అయితే నన్ను క్షమించవూ?"

"తప్పకుండా గిరిజా!-కాని నిన్ను క్షమించడానికి నువ్వునాకు ఏ ద్రోహంకాని, ఏమోసంగాని చేయలేదే!"

"వసంత్! చాలు, ఇకచాలు.... నాకు శాంతి చేకూరింది. ఇకనిద్రపోతా- శాశ్వతంగా!"

అంటూ కళ్ళుమూసింది గిరిజ.... అందరూ గొల్లుమన్నారు. అంతే! ఆమెజీవితం.

ఈ లేత్రాయంలో సంఘానికి, తలిదండ్రుల స్వార్థానికి, నికృష్ట ఆశాయానికి బలి అయి పోయింది!-

పాపం! పిచ్చివాడైపోయాడు వసంతరావు.... లోకమంతా జాలిపొందింది.... కాని అతనికి మనశ్శాంతి ఎక్కడిది? క్రమంగా శుష్కించి పోయాడు. ఓనాడు తన అనిత్య దేహాన్ని, పంచభూత సంకలిత కళేబరాన్ని ఈ లోకంలో విడిచిపెట్టి వెళ్ళిపోయాడు!!

ఈప్రేమజీవుల అస్తమయం వల్ల సంఘానికి తీరని లోటు సంభవించడం లేదా?

---

## విజ్ఞప్తి

'గృహలక్ష్మి' యందలి రచయితల చిత్రపటములు ప్రచురింపుడని పలువురు కోరుచున్నారు. ఆకోరిక మాకిదివరకేగల అభిలాషను ఇనుమడింప చేసినది. కాన క్లుప్తమగు తమ చరిత్రలతోపాటు చిత్రపటములనుగూడ రచయితలు మాకంపగోరెదము.

సంపాదకుడు.

---

# చిత్రప్రశ్నలకు జవాబు

మొదటి ప్రశ్నకు ప్రత్యుత్తరము.

తోలుకరికెక్కు బయలు దేరును 'మొలక'
పసిపాపలాడు కోవచ్చు 'గిలక'
వ్రాయుట కుపయోగపడు వస్తువు 'పలక'
నేత్రకంటకముగా నేర్చు 'నలక'
వత్సర నామమై వరలుగా 'కీలక'
చిలుకరాల జాతికిఁజెందు 'గులక'
నేయుట కొకరీతి నెగడు చుండు 'నులక'
పండితు శిరముపై నుండు 'పిలక'

వెలయు'గృహలక్ష్మి'కి ముడుంబ- వెంకటమ్మ
నైననే గతమాసము నందుపంపి
యున్న ప్రశ్నకు నిద్దియే యుచిత మైన
యుత్తరము విన్నవించితి నువిదలార!

రెండవప్రశ్నకు ప్రత్యుత్తరము

అత్తగారును కోడలు, నాడుబిడ్డ
వదిన, తల్లియుఁగూతురుఁ, బొదలునింట
ముప్వురే యాడువారౌట మూడరిసెలు
పంచవచ్చు నొక్కొకటిగ దుంచకుండ"

—ముడుంబ వెంకటమ్మ

[శ్రీమతులు జాస్తి తులశమ్మ, వద్దివర్తి శకుంతలాదేవి, బి. శకుంతలాదేవి, యి. సీతారత్నం వేమూరి రామశేషమ్మ, తూములూరి హైమవతి, గొల్లపూడి లక్ష్మీకన్యాకుమారి, మర్ల కామేశ్వరి, చిలకపాటి అమ్మణ్ణి, చిలకపాటి సీతాంబగార్లున్నూ జబాబు లంపినారు. ఒకరిద్దరొకటి రెండు, జవాబులు తప్పు వ్రాశారు. అయితే కీ. శే. వెంకటమ్మగారి గౌరవార్థం వాటినిచ్చుట ప్రస్తావించలేదు. శ్రీ వెంకటమ్మగారే పంపియుండిన జబాబున్నూ ప్రచురించాము. కాబట్టి ఆయావారు తమవానిని దానికి సరిచూచికొని సమాధాన పెట్టుకో గోరుతాము. గృ॥ సం॥ ]

# ★ కీ॥ శే॥ శ్రీమతి ముడంబ వెంకటమ్మగారు. ★



శ్రీమతి ముడుంబవెంకటమ్మగారి పుట్టిల్లు రాజమండ్రి తాలూకా రఘుదేవపురం. తండ్రి శ్రీమాన్ మరంగంటి నరసింహాచార్యులుగారు. వీరు అప్పచెల్లెండ్రు ఎనిమిది మంది. వారి అన్నదమ్ములు నలుగురు. వీరి మేనమామలు శ్రీమాన్ ముడంబ రామానుజాచార్యులు, సీతారామాచార్యులుగార్లు డిప్టీకలెక్టరు, సబ్ మ్యాజస్ట్రేటు ఉద్యోగములొనర్చి రిటైరైరి.

వీరికి 11 వ ఏటనే వివాహమైనది. తాళ్లరేవు వాస్తవ్యులైన శ్రీమాన్ ముడుంబ నరసింహాచార్యులుగారు వీరి భర్తగారు. మామగారు శ్రీమాన్ దొడ్డయాచార్లుగారు.

వీరి అత్తింటివారు సామాన్య గృహస్థులు. భర్తగారు తూ॥ గోదావరిజిల్లా మండపేటలో గవర్నమెంటు గరల్స్‌స్కూలులో టీచర్‌గా నుండిరి. ఇంతలో 1921 సం॥ సహాయ నిరాకరణోద్యమము వచ్చి పడినది. శ్రీనరసింహాచార్యులుగారు ఉద్యోగము విరమించుకొందమా వలదా యని డోలాందోళిత మనస్కులై స్కూలులో కాలక్షేపము చేయుచుండగా ఇంటివద్దనుండి శ్రీవెంకటమ్మగారు వ్రాసిన ఉత్తరము వచ్చినది. అందులో ఆమె వ్రాసిన ముఖ్యాంశముల సారమేమనగా :—

భర్త దేశసేవాసక్తులై ఉద్యోగము చాలించుకోదలచినచో వెనుదీయ వలదనిరి. తానుభర్త వెంబడి అన్ని విధముల దేశసేవయందు సహధర్మచారిణియై వర్తింతుమనిరి. వారితోపాటు దేశసేవయందెన్ని ఘోరకష్టములైనను తాము భరింతుమనిరి. ఆలుబిడ్డల కొరకని భర్త తన ఉన్నతాదర్శములను విడిచి పెట్ట నవసరము లేదని కూడ హెచ్చరించిరి. వేయేల; భర్తగారి దేశసేవా కార్యకలాపమున తాను తననగలు బట్టలు, పిల్లలు, తనసర్వస్వము వారి అధీనమనిరి.

ఆయుత్తరము చూచుకొన్నంతనే దివ్య ప్రబంధమును గాంచినంత పరమోత్సాహమున శ్రీనరసింహాచార్యులుగారు ఒక్కనిమిషములో ఉద్యోగమును వీడి త్యాగదీక్ష, సేవాదీక్షగైకొనిరి. శ్రీవెంకటమ్మగారు తానువ్రాసిన ప్రత్యక్షరమును, హరిచరణసాన్నిధ్యమున చేరునంతవరకు సుమారు 24 సం॥ ల కాలము ఆచరించి ధన్యురాలైరి.

కొమారుడు భార్యమాటలువిని ఉద్యోగమును చాలించుకొనెనే అనికోపించి, పగవూని, వీరిమామగారు కుటుంబమునే బహిష్కరించి కొన్నాళ్లు ఏసహాయమును చేయుట మానిరి. తనపుట్టింటివారును అట్టి వైఖరినే కనుబరచిరి. వీరిబంధుజాలమును, స్నేహితవర్గమును వీరియెడ శీతకన్ను వైచిరి. దేనికిని జంకక భర్తకెట్టి మనోవ్యథ కలుగకుండ భక్తియుక్తులతో కుచేలుని ధర్మపత్నివలె పతికనురక్తయై కుటుంబమును గుట్టుగా నిర్వహింప జొచ్చిరి. భర్తకు నిరంతరము ధైర్యసాహసములు పురిగొల్పిరి.

1921 నుండియు భర్తతోపాటు ఖద్దరు బట్టలను భుజముపై వేసుకొని యూరూరు దిరిగి విక్రయించుచు ఖద్దరు ప్రచారము గావించినారు వెంకటమ్మగారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహమున వీరి

భర్తగారు మున్ముందు జైలునకేగిరి. ఆపిదప వీరి పెద్దకుమారులు శ్రీదొడ్డయాచార్యులుగారు శిక్షితులైరి. తరువాత రెండవ కుమారుడున్నూ వారిననుసరించినాడు. ఆపిదప ఎడబిడ్డను చంటిబిడ్డను వెంట నిడుకొని ఈతల్లి వేలూరు స్త్రీల కారాగారవాసమునకు నడిచెను. అచ్చట 1 సం॥ కఠినశిక్షయు, సాటి వారలు మెచ్చునట్లుగా ఆదర్శప్రాయముగా నడిపిరి. 1932 సం॥ శాసనోల్లంఘనమున వీరు వీరి భర్తగారు కొమారులు నేగాక, వీరి పెద్దకోడలును వీరితో జైలునకు నడిచి ధన్యురాలైనది. వీరికుటుంబములో ఎల్లరును ఒకటి రెండు మూడుసార్లు జైలుచూచినవారే.

వీరికుటుంబమంతయు పూర్వాచార పరాయణత్వము కలది. వీరు జైలునందును స్వయంపాక మొనర్చుకొనేవారు, అచ్చట వీరిపవిత్ర జీవితము అందరి కాదర్శప్రాయముగా నుండెడిది.

అసలే స్త్రీ; అందును భక్తి ప్రాధాన్యముగల వైష్ణవ ప్రపత్తి ఇంటపుట్టి, వంట జీర్ణించినది. భర్తభావానురక్తి, దేశసేవాసక్తి. గాంధీయుగమున రాజకీయములు దేశభక్తిపూరితములు; దేశసేవా పూర్వకములు. వెంకటమ్మగారు కుదురుగా ఈకుటుంబము దేశ సేవకా బృందములో మెరసినదని వేరుగా చెప్పవలయునా! వీరిదేశ భక్తి వీరావేశ పూరితము. చూడుడు: తమ తనయులలో నొకనికి సత్యాగ్రహిఅనియు మరొకనికి పతాకమనియు పేరిడుకొనిరి. వీరి పెద్దకోడలు సాక్షాత్తు స్వరాజ్య లక్ష్మియే.

అంత్యకాలమున వీరు తాళ్లరేవున స్వగృహములో ఒక బాలికా సదనం స్థాపించినారు. 1945- జనవరి 25- తేదిన వీరు శ్రీ హరిచరణ సాన్నిధ్యముం జేరిరి.

ఈ దంపతులు తాము త్యాగమొనర్చి దేశసేవా సక్తులమైతిమి గదాయని తమబిడ్డలను చదువు సంధ్యలు లేని వాజమ్మల నొనర్చి, దేశమ్మ కానల గావింపక, చక్కని విద్యాబుద్ధుల నేర్పి ప్రయోజకుల గావించిరి. పెద్దకుమారుడు దొడ్డయాచార్యులగారు ఆయుర్వేద వైద్యులుగా నున్నారు. రెండవ కుమారులు నరసింహాచార్యులుగారు మద్రాసు హిందీప్రచారకసభలో హిందీ అధ్యాపకులు గానున్నారు. మూడవ వారును, నాలవ వారును ఉపాధ్యాయులుగా నున్నారు.

[వీరు 1942 ప్రాంతమున మా 'గృహలక్ష్మి' కి గతమాసమున ప్రకటించిన చిత్రప్రశ్నల పంపియుండిరి. పాపము వానిని అచ్చుపడగా చూచుకొన జాలరైరి. చిలకాల గతములైనను-వారుప్రస్తుతము కీర్తిశేషులగుటచే-వారి ఆత్మశాంతిగా, వారంపిన చిత్రప్రశ్నలను తదుత్తరములను ప్రకటించి-ప్రస్తావనగా ఆదర్శప్రాయమగు వారి జీవితచరిత్రను గూడ ప్రకటించితిమి. గృ॥ సం ॥]

—(o)—

# వైజ్ఞానిక విశేషాలు.

సర్ ఆల్మ్రోత్ రైట్ అనే బ్రిటిష్ సైన్సు శాస్త్రజ్ఞుడు తన 85 సం॥ న ఏప్రిల్ నెలాఖరున స్వర్గస్థుడైనాడు. ఈయన టైఫాయిడ్ జ్వరానికి ఇంజక్షన్ కనిపెట్టినారు. దానివల్ల గతయుద్ధంలో 1 00 000- ప్రాణాలు రక్షింపబడ్డాయి. త్యాగం బహుముఖాలు! ఈ మహానుభావుడు 40-సం॥ ల పర్యంతం ప్రతిరోజూ నూ, ఒక టీ స్పూనెడు రక్తం తనదేహంలోనుంచే తీస్కొని లోకం కొరకు వైద్యపరిశోధనలు సాగించిన మహా త్యాగి. ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక.

... ... ...

మే 1 వ తేదిన బ్రిటిష్ మస్కిటో విమానం లండన్ నుండి కేప్ టౌన్ కు 21 గం॥ ల 29 ని॥ లలో వచ్చి చేరినది. దూరం 6717 మైళ్లు. 1937 సం ॥ లో ఇదే ఆకాశ యానం 54 గం ॥ 6 ని ॥లు పట్టినది.

... ... ...

సముద్రం వారఉండే జమ్ము, దర్భ మొదలైన వానిలోనుంచి ఎరువులు తయారు చేయుటకు స్కాంట్లండులో పరిశోధనలు సాగుతున్నవి.

... ... ...

లండన్ ఆసుపత్రిలో ఇన్ఫ్లుయెంజా జ్వరమునకు కారణము కనిపెట్ట డానికి కొత్త పరిశోధనలు చేస్తున్నారట.

... ... ...

క్రొత్తగా చిన్న ఫోటోగ్రాఫ్ కెమెరా కనిపెట్టబడినది. 2 అం॥ పొడవు; $1\frac{1}{2}$ అం॥ వెడల్పు; $1\frac{1}{4}$ అం॥ మందం. పోస్టుబిళ్లలో సగంసైజు నెగటివ్ మూర్తి ఏర్పడుతుంది. కార్డు సైజుకు విస్తరింప జేస్తే బొమ్మ చక్కగా వివరంగా ఉంటుందట.

... ... ...

జర్మనీ శాస్త్రజ్ఞులు అసాధ్యపు వాళ్లు. ఉరల గడ్డలను పొగాకు రసంలో నానవేసి మొలేస్తే పొగాకు వంటి ఆకులు ఆమొలకలకు పుట్టినవట. అట్లాగే గోధుములను కాఫీకషాయములో (పచ్చిదానిలో)ఊరవేసి నాటితే కాఫీవాసన కలిగిన గోధుమలు పండినవట.

... ... ...

జపానుయుద్ధం గెల్వడానికి మూలమైన దివ్యాయుధం ఆటంబాంబు. దానిమహిమలు చిత్ర విచిత్రాలుగా బయటికి వస్తున్నవి. 2 సం॥ క్రిందట నాగసాకిమీద యీబాంబువేయగా సర్వమూ ధ్వంసమైనది. అయితే మామూలుగా ఆభూమిలో ఎదబెట్టబడిన విత్తనములు వృధాపోలేదు. భూమియందలి పరమాణువులలో నుండేశక్తి, బీజములలోనుండే సృష్టిశక్తి విజృంభించినవి కాబోలు - అచ్చట కాసిన ఆ విత్తనములు మొలిచి - విపరీతంగా పంట పండుతున్నదట.

# శ్రీ కాశీశ్వరరావు పంతులుగారి క్రొత్తబిల్లు.

బహుభార్యా భర్తృత్వముల నిషేధించి, వివాహముల రద్దున కనుమతినిచ్చు బిల్లు.

4 (1) ఇందుకు వ్యతిరేకంగా ఎట్టిచట్టం, ఆచారం, సాంప్రదాయం ఉండుగాక; ఈచట్టం అమలు జరగడం ప్రారంభం అయినతర్వాత ఒకపురుషుడు, ఒక స్త్రీ, వారిలో నెవరికైనా ఒకభర్త లేక భార్య ఆకాలమునందు బ్రతికి యుండగా, చేసుకొనే వివాహము, ఆవివాహము మద్రాసు రాష్ట్రములో జరగనీ, వెలుపల జరగనీ, చెల్లదు.

అయితే మరియొకరితో తనకు జరిగిన వివాహ బంధము, ఎవరిదైతే ఈచట్టంలోగల 5 సె॥ క్రిందగాని తత్కాల మందు అమలులో నుండే మరియే యితర వివాహ విచ్ఛేదకపు చట్టము క్రిందగాని, అర్హతగల కోర్టువారి తీర్పువల్ల, రద్దుపరుప బడియున్నచో, అట్టి స్త్రీ గాని పురుషుడుగాని, ఆతీర్పు అయినపిదప, ఆరు నెలలకు తర్వాత, ఆట్లారద్దైన వివాహ బంధమునకు రెండవపార్టీ జీవించి యున్నాసరే, తిరిగీ చెల్లగల సక్రమమైన వివాహం చేసుకోవచ్చును.

(5) (1) ఈచట్టం అమలులోనికిరాక ముందున్నూ, వచ్చినపిదపయున్నూ, వివాహబంధ మేర్పరచుకొన్న ఉభయులలోనూ ఎవ్వరైనాసరే, 18 సం॥ ల వయస్సు పూర్తిఅయినవారు, ఏకోర్టుకు సంబంధించిన జ్యూరిష్ డిక్షనులో, వివాహమైనదో లేక ఇందుకు సంబంధించిన ఇతరపార్టీ ఇష్టపూర్తిగాను వాస్తవముగాను నివసిస్తున్నారో, అట్టి సబ్ కోర్టులో, లేదా జిల్లాకోర్టులో, లేదా హైకోర్టులో ఈ క్రిందికారణములచేత వివాహము రద్దుపరచండిఅని పిటిషన్ పెట్టవచ్చును:

(అ) అవతలపార్టీ, భర్తఅయినట్లయితే, ఆతడు వేరేస్త్రీని ఉంపుడుకత్తెగా కలిగియున్నను,

(ఆ) అవతలపార్టీ భార్యఅయినట్లయితే, ఆమె మరొకని, వుంపుడుకత్తెగా ఉన్నను, లేదా, వ్యభిచారమే వృత్తిగాకలిగియున్నను,

(ఇ) అవతలిపార్టీ, సరియైన కారణములేకుండా ఈ పిటిషన్ పెట్టడానికి ముందు ఎడతెగకుండా 3 సం॥ లకు తక్కువగాని కాల పర్యంతము, పిటిషనరుని విడిచివున్నను,

(ఈ) అవతలిపార్టీగాని, వాని, లేక ఆమెయొక్క మద్దతుతో, అవతలిపార్టీ బంధువులుగాని, స్నేహితులుగాని, పిటిషనరును నిరంతరము బాధపెట్టుచున్నను,

(ఉ) పిటిషన్ పెట్టుటకుముందు ఎడతెగకుండా, 3 సం॥ లకు తక్కువగాని కాలపర్యంతము, అవతలిపార్టీ, కుదరని పిచ్చిచే బాధపడుచున్నను,

(ఊ) పిటిషన్ పెట్టుటకుముందు ఎడతెగకుండా, 3 సం॥ లకు తక్కువగాని కాలపర్యంతము - అవతలపార్టీ, పిటిషనరువల్ల సంక్రమించ నట్టిన్నీ, తీవ్రమై, కుదరనటు వంటిన్నీ, కుష్టువ్యాధివల్ల బాధపడుచున్నను,

(2) సబ్ సెక్షన్ (1) క్రిందపెట్టబడే పిటిషన్ లో, వివాహమును రద్దుపరచమని కోరుటకుగల కారణములు ఆకేసు నైజమునుబట్టి వీలైనంత మేరకు స్పష్టముగా చెప్పబడవలెను.

(4) సబ్ కోర్టువారుగాని, జిల్లాజడ్జీ కోర్టువారుగాని, హైకోర్టువారుగాని ఇచ్చేతీర్పుపై-హైకోర్టు యొక్క అపిలెట్ జ్యూరిస్‌డిక్షన్ లో అప్పీలు చేయబడవచ్చును. హైకోర్టువారు అప్పీలు విచారించి చేయుతీర్పు ఖాయము.

(5) (1) సబ్ సెక్షన్ ప్రకారం పెట్టబడే పిటిషనుకున్ను, (4) సబ్ సెక్షన్ ప్రకారం చేయబడే అప్పీలుకున్ను కోర్టుఫీజు రు 10-0-0.

(6) కోర్టువారు ఈ సెక్షన్ క్రింద వివాహమును రద్దుపరుస్తూ ఈ క్రిందివిషయములకై తగుఏర్పాట్లు గావించ వలయును:-

(1) ఈ సెక్షన్‌లోని సబ్ సెక్షన్ (1) క్రింద, (అ) (ఉ) (ఊ)అనే క్లాజులలో చెప్పబడిన కారణములకైయున్నా (ఇ) క్లాజుప్రకారం స్త్రీని భర్తవదిలేసిన కారణమునకైయున్నా (ఈ) క్లాజుప్రకారం భర్తవల్లలేక భర్తమద్దతువల్ల స్త్రీని నిరంతరమూ బాధపెట్టబడుచున్న కారణమునకేయున్నా వివాహం రద్దు చేసేయెడల - ఆ స్త్రీ మరొకని వివాహం చేసుకొనేదాకా ఆమెకు మనువర్తిఏర్పాటు చేయవలెను.

(11) అట్లా రద్దుఅయినవివాహము ఫలితముగా పుట్టినమైనరు బిడ్డలుంటే, వారిని, దగ్గరఉంచుకొని పోషించుటకు, పోషణఖర్చునకు ఏర్పాటు చేయవలెను.

[ ఈ బిల్లు 23-4-47 న మద్రాసు శాసన సభలో ప్రవేశ పెట్టబడినది. ప్రజాభిప్రాయము నెరుంగుటకై ప్రచురింపబడినది. దీనిపై అభిప్రాయములు 14-6-47 లోపల మద్రాసు ప్రభుత్వమువారికి చేరవలయును. ఆపైన పంపరాదు. మా పత్రికలో వచ్చేనెల సంచికలో, అభిప్రాయముల నంపిన ప్రకటింతుము. గృ॥ సం॥ ]

---

# గమనిక.

'గృహలక్ష్మి' పాఠకులకు, ఏజంట్లకు.

★ ఇంతటినుండి మా పత్రిక ప్రతినెల 15 వ తేదీకి వెలువడుతుంది.

★ ఇదివరకువలెనే మా పత్రిక త్రివర్ణ చిత్రములతో శోభాయమానంగా వెలువడుతుంది.

మేనేజరు,

గృహలక్ష్మి.

# బాల విజ్ఞానము

శ్రీ రామాచార్యులుగారు.

"అమ్మా, అమ్మా, మన పాదుకి చిన్నపిల్ల పుట్టిందే" అంటూ గంతు వేసుకుని వాళ్లమ్మదగ్గరకు చేరింది మణి.

మణెమ్మ గబ గబా వెళ్లి దొడ్లోని పొట్లపాదు చూసింది. అప్పుడే చిన్న చిన్న పిందెలు కనబడుతూ వున్నాయి.

'అదుగోనే, అమ్మా ! పాదుపిల్ల-'

పాదుకి పిల్లపుట్టడం ఏమిటీ అని - పాదు 'కాసింది'; ఆవు, గేదె 'యీనింది'; పిల్ల 'పుట్టింది' అంటారమ్మా-అని, పాదుకాస్తే పిందె, కాయ అంటారని; ఆవు, గేదె యీస్తే తువ్వాయి అంటారని, పిల్ల పుడితే పాపాయి అంటారని యింకా ఏదేదో చెప్పబోయి -

'అమ్మాయీ! ఒక చిన్నరాయి తీసుకురా అమ్మా!' అని మణెమ్మ చెప్పింది.

మణికి ఆరాయి ఎందుకో అర్థంకాలేదు. అమ్మ చెప్పిందిగదా అని ఓచిన్నరాయి తీసుకొచ్చి వాళ్లమ్మకి యిచ్చింది.

ఆరాతికి ఒక చిన్న తాడుకట్టి, ఆతాడు ఆపొట్లపిందెకి వ్రేలాడ కట్టింది తల్లి.

'అమ్మా! ఆరాయి ఎందుకే అలాకట్టావు?' అని పదేపదే అడగడం మొదలెట్టింది మణి.

కుర్రాళ్లకి జవాబుచెప్పడం మహాకష్టం. చూస్తూవూరుకోక, ఎందుకే యీ చొప్పదంటు ప్రశ్నలు? అని గదమాయించింది పిల్లని.

మణి ఏడుస్తూ కూర్చుంది

'పాఠాలు చదువుకోక ఎందుకూ ఆఏడుపు? ఏడ్చావంటే చూడు!' అని విసుగుతో ఒకటేసింది పిల్లని. ఇంతలో సింహంలా వచ్చాడు మణినాన్న నరసింహం.

'ఎందుకే? అలా ఏడిపిస్తున్నావ్, అమ్మాయిని?

'ఆఁ ఏముంది - మన పొట్లపాదుకి చిన్న పిందె కాసింది. దానికి రాయికట్టా - యిక అక్కడ్నించి ఆరాయి ఎందుకు, ఎందుకూ అని తెగఅడగడం' అని విసుగ్గాఅంది మణెమ్మ.

'అదే, ఆ విసుక్కోవడమే వద్దన్నా. ఇంతకీ ఆరాయి అలాకట్టడం ఎందుకో నీకైనా తెలిస్తేగా. అందుకే 'గృహలక్ష్మి', 'బాల' పత్రికలు చదివితే నీలాంటి తల్లులు, పిల్లలు వేసేప్రశ్నలకు విసుక్కోకుండా. చక్కగా వాటికి జవాబులు చెప్పి బాలలని విజ్ఞానవంతులుగా చేస్తారు.!

'నాన్నా! ఎందుకూ ఆరాయి? అని మణి తిరిగి అడిగింది.

'పిందె కాసినప్పుడే ఆరాయి కడితే, ఆపొట్లపిందె పెద్దదై, కాయ అయ్యేటప్పటికి వంకరలేమీ లేకుండా తిన్నగా వస్తుంది. అలాగే బాలలుగూడా చిన్నతనంనుంచి జాగ్రత్తగా అమ్మ, నాన్న, మేష్టారు చెప్పినట్టు వింటూంటే, పెద్దవాళ్లయ్యే టప్పటికి గొప్పవాళ్లవుతార'ని ఒక చక్కనిపాఠంచెప్పాడు నరసింహం.

చూశారా! అలాగే ప్రపంచకంలో ప్రతివస్తువునిగూర్చి ఒక్కొక్క చక్కనివిషయం తెలుసుకోవచ్చు.




దిలీప్‌సింగ్ బీర్ అనే పంజాబీ అమెరికాకు వలస పోయినాడు. 1945 లో అక్కడ స్వర్గస్థుడైనాడు. అతని కిద్దరి భార్యలు. అతడు వదలివెళ్లిన ఆస్తి 1500 డాలర్లు ఎవరికి చెందవలెననేది తగాదా వచ్చింది. కోర్టు కెక్కినారు. అమెరికాలో న్యాయాధీశుడు 'అమెరికన్ లా ప్రకారం ఒకతెనే ధర్మపత్నిగా అంగీకరిస్తారు; ఆ ధర్మపత్ని ముందువచ్చిన భార్య; ఆమెకు చెందవలె' అన్నాడు. ఎవరు మొదటిభార్యో నిర్ణయింపను పంజాబున వారు నివసించే జిల్లాలో పంచాయితీదార్ల నేర్పాటు చేయగా, వారు నిర్ణయింపజాలక పోయినారు. వింత ఏమంటే - ఆ భార్యలే తమలో ముందు వచ్చింది ఎవరో జ్ఞాపకంగా చెప్పలేకున్నారట.

♦ ♦ ♦

బీహారులో నొక గ్రామంలో ధనవంతుడైన శేట్ ఇంటికి బందిపోటుదొంగలు ముప్ఫయిమంది సాయుధులై వచ్చారు. సేట్‌ను చేతికి కాలికి అంటగట్టి పడేసి తాళపుచేతులిమ్మని గద్దరించారు. శేట్ పెండ్లాము తాళాలు వాళ్లమీద పారేసి చల్లగా దొడ్లోకి జారుకుంది. దొడ్లో పెద్దగడ్డి వామి ఉన్నది. ఆమె వెంటనే ఆగడ్డివామి నంటించి వేసినది. పెద్దమంటలు రేగినవి. ఊరివారంతా లేచారు. ముందు దొంగలను తన్నితరిమేశారు. ఈ దొమ్ములాటలో నలుగురు దొంగలు చచ్చినారు; ఒకడు గాయపడ్డాడు. ఆభాగ్యశాలికి సమయానికి ఉపాయంతోచినందుకు మెచ్చుకోవాలి.

♦ ♦ ♦

మిలిమిల్లెట్ అనేఆమె 19 సం|| ల అందకత్తె; పారిస్‌నగరవాసి. పోస్టు ఆఫీసులో ఉద్యోగం. గతమాసాంతంలో ఆదివారంరాత్రి సినిమా చూచివచ్చి నిద్రపోయింది. వారమైనా లేవలేదు. డాక్టర్లు పరీక్షిస్తున్నారు. ఈ చిత్రం ఏమిటో తెలుసుకోలేక డాక్టర్లు చీకాకుపడుతున్నారు.

♦ ♦ ♦

కలకత్తా యూనివర్సిటీ మెట్రిక్యులేషన్ పరీక్షలకు ఈసారి నిలిచినవారు 62000 మంది. ఇంతమంది ఏయూనివర్సిటీలోలేరు. వీరిలో 7000 మంది స్త్రీలు.

♦ ♦ ♦

పంజాబులో హిందూ ముస్లిం అల్లరులు తిరిగీ చెలరేగినవి. వైస్‌రాయి సతి ముల్లాన్ వెళ్లి బాధితులను చూచి సానుభూతి వాక్యాలుపల్కి శాంతంగా ఉండమని కోరినది.

—(o)—



రావు బహద్దూరు పి. సంబంధం మొదలియారుగారు, గొప్ప తమిళ నటులు. వారు హిందూపత్రికయందు ఇట్లు వ్రాసినారు:—

పూర్వకాలంలో సంగీతము ప్రజలకు ఉల్లాసము కల్పించే ఒకానొక వినోద విశేషప్రదర్శనము. ఆసంగీతమును ముఖ్యముగా ఒకకులమువారిలో స్త్రీలే అభ్యసించి ప్రదర్శిస్తూ ఉండిరి. ఆపిదప సంగీత పాటకులైన పురుషులున్నూ అట్టి ప్రదర్శనముల నొసంగుట వృత్తిగా నవలంబించినారు. అప్పుడు, కొన్ని పదుల సంవత్సరాల క్రిందట, స్త్రీ పాటకురాండ్ర ప్రదర్శనములను బహిష్కరింప ప్రయత్నము జరిగినది. ఇదిచాల చెడ్డవిషయము. అయితే సంగీత ప్రియులు పలువురు - సంగీతము లలితకళ; పాడేది స్త్రీయా పురుషుడా, ఎవరావ్యక్తి అనేవివక్షత పాటించకుండానే మెచ్చిహర్షింప దగినది, అని తలంచిరి. స్త్రీ పాటకురాండ్రకు వ్యతిరేకముగా నడిచిన ఆప్రచారము త్వరలో అంతరించి పోయినది.

... ... ...

దేశంలో ఇన్ని కల్లోలాలకు సగం కారణం స్త్రీ పురుషులకు ఒద్దిక లేక పోవడమే. స్త్రీలు వెనుక పడరాదు. పురుషులతోపాటు దేశాభివృద్ధికై పాటుపడవలెను. స్త్రీలు విద్యావంతురాండ్రై విశాలహృదయంతో ఆలోచిస్తే, ఈ మతకలహాలు ఇంతగా జరుగవు. గాంధీగారు అన్నట్లుగా, స్త్రీలు అభివృద్ధికానిదే ఈ దేశానికి మోక్షంలేదు.

శ్రీమతి రాధా సుబ్బరాయన్, స్టేటుకౌన్సిల్ మెంబర్.

సింధురాష్ట్రంలో హిందూ 'ఆమిల్' లందు పెండ్లి కూతుళ్ల 'బ్లాక్ మార్కెట్' బాగా సాగుతున్నది. ప్రభుత్వం వారైతే వరకట్నం రు|| 1000 లకంటే మించరాదని నిష్కర్ష చేసినారు. కాని (సింధు) హైదరాబాదు పట్నంలో గతవారంలో కొందరు పెండ్లికొడుకులు, పెళ్లికూతుళ్ల తలిదండ్రులు, 10 వేలు మొదలు 30 వేలవరకు కక్కితేనే గాని, పునస్సంధాన మహోత్సవములు అడుగు సాగనివ్వము-అని పట్టుబట్టినారట.

గ్లోబ్ అనే పత్రిక. విదేశ పత్రిక.

ల్యాల్‌పూర్ వ్యవసాయ కళాశాలలో ప్రిన్సిపాల్ మైదాపిండి తయారుచేయుటకు నిధి. వారివద్ద అనేక విద్యుచ్ఛక్తి యంత్రములున్నవి వాని సాహాయ్యమున వారు గోధుమలలో నున్న బలకరమగు పదార్థముల నన్నిటిని పారద్రోలి కేవలము పిండిని మిగల్చగలరు. వారివద్ద విద్యుచ్ఛక్తిచే గిరగిర తిరిగే పెనము పొయ్యికూడా ఉన్నది. తెల్లరొట్టె తయారు చేసి ఆముక్కలను క్రమముగా పేర్చుట వారి కార్యక్రమము. ఇట్టిది సంపూర్ణమైన తెల్లమైదాపిండితోనే చేయసాధ్యము. ఈప్రిన్సిపాల్ గారిని మనము శాస్త్రయుక్తంగా వాస్తవముగా "ఆహార విధ్వంసక నిపుణుడు" అని పిలువ వచ్చునుగదా! కరువుచే బాధపడు దేశంలో వీరికి స్థానం కలదా?

—జే. సి. కుమారప్ప. "హరిజన్"




## సర్. కొండి రామమూర్తిగారికి ఆక్టింగుగవర్నరుపదవి.

సర్. కొండి రామమూర్తి పంతులుగారికి బొంబాయి ఆక్టింగు గవర్నరు పదవి అయినందులకు వారిని వారి సతీమణిని మిక్కిలిగా అభినందిస్తున్నాము. భర్తతోపాటుభార్యకును గౌరవప్రపత్తులేర్పడునట్టి దీయుద్యోగము. ఆమెగారి కీకొలది రోజులలోనైన బొంబాయి రాజధాని యందలి స్త్రీల సంస్థలతో పరిచయ మొనర్చుకొనే అవకాశము కలుగును. ఆపరిచయము మనరాష్ట్రమున స్త్రీల అభివృద్ధి కార్యక్రమముల నామె యుపయోగింప నగును.

## రానున్న స్థానిక సంస్థల ఎన్నికలు.

ఈ జూన్, జూలై నెలలలో మద్రాసు రాష్ట్రంలో స్థానిక సంస్థల ఎన్నికలు రాబోతున్నవి. ఈ ఎన్నికలలో హెచ్చుగా స్త్రీలు ఎన్నుకోబడవలయునని మాకోరిక. స్త్రీలకొరకు కొన్నిస్థానములు ప్రత్యేకింపబడినమాట వాస్తవమే. అయితే వారు చిరకాలంనుంచీ సంయుక్త నియోజక వర్గాలనే సమ్మతించి జాతీయతా నిర్మాణానికి తోడ్పడ్డారు. దామాషామీద ప్రత్యేకస్థానాలు, ప్రత్యేక నియోజకవర్గాలు కోరి ఉంటే - వారికిప్పుడుగల ప్రత్యేకస్థానాలకన్నా హెచ్చువచ్చేది నిజము. అయితే అది జాతీయతాభివృద్ధికి భంగకరమని అట్లాచేయలేదు. జనాభాలో స్త్రీలు సగం అనేమాట మరువరాదు. వారిని తగినంత మందినీ ఎన్నికసంస్థలకు రానిచ్చి, పరిపాలనాబాధ్యతల నిర్వహింప నిచ్చిన నాడే స్త్రీకి సమానమైనహక్కు, బాధ్యత లొసంగుచున్నా మనేదానికి అర్థముంటుంది. ఇందులకు స్త్రీసంఘాలు పట్టుదలతో కృషిచేయాలి.

## సమ్మెలు, స్త్రీకార్మికులు

దేశమంతటా నేడు విస్తారముగా సమ్మెలు సాగుచున్నవి. సమ్మెలనణచుటకై ప్రభుత్వము నిర్బంధ విధానము నవలంబిస్తున్నది. సమ్మెరోజులలో కార్మికులు జీతనాతములు లేక మాడుచున్నారు. సమ్మెలో చేరిన కార్మికులు చేరనివారిని తొందరపెట్టుతారు. ఈకార్మికులలో స్త్రీలు ఉంటున్నారు. దిక్కులేకగదా స్త్రీ ఇల్లు వదలి కూలినాలికి వస్తున్నది? అట్టి స్త్రీని పురుషునితోబాటు పైబాధలన్నీ పడమనడం, పడనీయడం, న్యాయంగాదు. ఈ సమ్మెలు సాగించే కార్మిక సంస్థలు సమ్మెలో చేరవలసిన అగత్యము నుండి స్త్రీలను తప్పించినట్లైతే ఈ బాధలన్నీ తప్పగలవని మావిశ్వాసము. కాబట్టి స్త్రీల సంఘాలు ఇందుకు గాను కృషిచేసి ఈ అవకాశాన్ని సాధించ దగునని మాఅభిప్రాయము.




ఆంధ్ర జ్యోతి                    ఉగాది సంచికలు.

ప్రత్యేక సంచిక కాబట్టి మామూలుకంటే హెచ్చుగా 160 పుటలదాకా వేశారు. ఇందులో దాదాపు అన్నీకథలే. ఈనాటి పత్రికలలో కథలనుగూర్చి విమర్శించాలంటే—అదొక్క కథను, గాథను మించి పురాణమవుతుంది. కాని ఇందు కొన్నికథలు విలక్షణంగా ఉన్నవి అనిమాత్రం చెప్పవచ్చు. వీనిలో ముఖ్యంగా "స్నేహితుని చెల్లెలు": ప్రతి నగరంలో కాలేజీ విద్యార్థులలో ఇదొక ప్రత్యేక జాతిఉన్నది. అయితే, ఇక్కడ, మూర్తికి తుదిఘట్టంలో ఓర్పులేకుండా చేశారు. ఆతనిచే ప్రేమభిక్షకోరబడి నిరాకరింపబడినది. ఈ తెగవారికి అసలు అడిగే సాహసముండదేమో? చివరకు ఆమె నిజముతెలిసి అతడు లోలోన గుటకలు మ్రింగునట్లు చేసినట్లైతే కథ ఇంకా అందంగా ఉండేదేమో! శ్రీమతి కొమ్మూరి పద్మావతిగారి కథ కూడా క్రొత్తపంథా త్రొక్కింది. నిజ సంతానం మీద అంత ప్రేమ రాహిత్యం—అపూర్వము. ఏవో పాశ్చాత్య దేశాల్లో కొత్త కొత్తగా పుడుతున్న భావాలివి. అంత మమకార రాహిత్యానికి కారణమేదీ సూచింపకపోవడం కథకొక్క లోటు. వీరు తుట్టతుదకు ప్రస్తుతపు మద్రాసు రాజకీయాలు తడివారు. వీరు అందులో ప్రకాశంగారి వాదమును కొంత వ్యతిరేకంగా విమర్శించారు. ఈ రోజులలో ఈ సాహసానికి పూనుకొనే తెలుగుపత్రికలు చాలా తక్కువగా ఉన్నవి. వీరు వేసిన రంగు చిత్రాలను మేమంతగా మెచ్చజాలకున్నాము. అందులో "రతీ మన్మథులు" అర్థశూన్యంగా ఉన్నది. ఒక భావానికి సంబంధించిన సామగ్రి అంతా ఒకచోట పులిమినమాత్రాన అదొక చిత్రంగాదు. ఆయాభావానికిసమన్వయం కుదరవలె; ప్రత్యక్షంగా కనిపించేది, పరోక్ష భావానుభూతిని కల్పించాలి. ముఖచిత్రంకూడా తత్తుల్యమే. స్థూలమూర్తుల వెనుక సూక్ష్మభావాలు మృగ్యం. వెల రు. 1-0-0 వలయువారు 37, ఆచారప్పన్ వీధి జార్జిటౌన్ అని వ్రాయాలి.

ప్ర జా బం ధు

14 సం॥ల నుంచీ అవిచ్ఛిన్నంగా నడుస్తున్న ప్రజాబంధు పత్రిక ఉగాది సంచికను, దానినిన్నాళ్లు నడిపిన శ్రీ ఎస్. జి. ఆచార్యాగారు అత్యుత్సాహంతో ఆంధ్రలోకానికి సమర్పించారు. ఈ సంచిక రంగుల చిత్రాలతో, వ్యంగ్య చిత్రాలతో, వివిధ కథలతో, కథా చిత్రాలతో, అందంగా, చందంగా ఉంది; పూర్వపు ఆంధ్రపత్రిక ఉగాది సంచికలను తలపిస్తున్నది. "తీవ్ర రాజకీయపత్రిక" అని లోని ముఖపత్రం పైన ఉన్నది. అయితే "ఉగాది సంచిక" కాబట్టి కాబోలు, తీవ్రరాజకీయాల వంకకు వ్రాలక, హెచ్చుగా ఉల్లాసకరమైన కథలతో, నాటికలతో, పద్యాలతో, వ్యాసాలతో నిండి ఆంధ్రుల నందరి నిది ఆకర్షిస్తున్నది. ఇట్టిది ఈనాటి పత్రికలలో చాలావరకు మృగ్యము. ఏదో వకవాదం చేబట్టి, సర్వేసర్వత్రా ఒకటే ఏకడం—వాటికి మామూలు. కాబట్టి ఈ విశిష్టత సంపాదకుని సంస్కారం తెలుపుతున్నది. అసలు శ్రీ ఆచార్యగారు "ప్రజాబంధు" కన్న ముందే పత్రికా ప్రపంచంలో పుట్టినవారు. కావున ఆ పూర్వవాసన లుండకపోవు. అంటే అంతా పాతవాసనలని కాదు. పిదప పుట్టిన పత్రికల కెన్నింటికో

ఆయనదే నరవడి అని మాకు తెలియని విషయంగాదు. ఈ పత్రిక ఎడతెగక చిరకాలం నడుచుగాక. వెల రు, 1-0-0. వీరి ఆఫీసుకు 39, ఆండర్‌సన్ వీధి, జి. టి. మద్రాసు అని వ్రాయుడు.

ఢంకా

ఢంకా సంవత్సరాది సంచిక కూడా మా కార్యాలయం చేరినది. ఇదిన్నీ 130 పేజీలవరకు గ్రంథ విస్తరం ఉన్నది. అన్నిసంచికలలో వలెనే దీనిలోనుపద్యము, గద్యము, కథ, నాటకం, వ్యాసములు, విమర్శలు కలవు. శ్రీశివశంకరశాస్త్రి, ఆంధ్ర శేషగిరిరావు, కోటం రాజురామారావు, నోరి నరసింహశాస్త్రి గొబ్బూరి వెంకటానందరాఘవరావు, కవికొండల వెంకటరావు, శ్రీరామాచార్యులుగార్లు తమతమ ఉత్తమ రచనలచే నీసంచిక నలంకరించినారు. ఈపత్రిక నూతన మంత్రి వర్గమన్నా, దానికి సుముఖులైన ఆంధ్రులన్నా ఒంటికాలిపై నురుకుతున్నది. 130 పుటల గ్రంథంలోను దీనికి సంబంధించినది సూటిగా వ్యంగంగా 26 పుటలదాకా ఉన్నది. అంటే ఐదోభాగం. అయితే అవతలి పక్షం వారు తూర్పార పట్టితే ఇందులో ఎన్ని అక్షరాలు నిలుస్తాయో తెలియదు. వెల రు 1-4-0. వలయువారు 6 సుంకురామచెట్టి వీధి మద్రాసు అని వ్రాయుడు.

(1) వీరరాఘవ శతకము. (2) జానకిరామ శతకము.

ఈ రెండున్నూ సంగీత సాహిత్య కళానిధులైన శ్రీమతి పినపాల నాగమణీదేవిగారు రచించిన శతకములు. గుంటూరు హిందూకళాశాల ప్రధానసంస్కృతాంధ్రోపన్యాసకులును శతావధానులును అగు మధ్వ శ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారిచే సంస్కరింపబడి, "సరళమగు కవితాధారతో భక్తిరసముకురిపింపజేయుచు పాఠకుల హృదయ మాకర్షింపగలదు" అని ప్రశంసింపబడిన ఈశతకముల తర మీపాటిదని జెప్పదరమా! ఇందు వీరరాఘవ శతకము ఉత్పలమాలాపూరితము. జానకిరామశతకము కందపద్యాత్మకము. కందమందముగాచెప్పగలవాడే కవియనినానుడిగదా. మొత్తముమీద వీరికవిత్వము ద్రాక్షాపాకమనవచ్చును. ఉభయమును శ్రీ రామచంద్రమూర్తి కన్వయమగుటచే వీరు శ్రీరామభక్త కోటికిచెందిన వారని తోస్తున్నది.

(1) శ్రీరామ శతకము. (2) శ్రీరామచంద్ర శతకము. (3) శ్రీరామ నక్షత్రమాల.

ఈమూడు గ్రంథములును పైగ్రంథముల రచించిన కవయిత్రి శ్రీమతి నాగమణ్యాంబపుత్రికారత్నంబును, ప్రస్తుతము నెల్లూరున ట్రెజరీ డిప్యూటీ కలెక్టరుగారి ధర్మపత్నియునైన శ్రీమతి బాలాత్రిపుర సుందరీదేవిగారిచే రచింపబడినవి. ఈమె తనతల్లిపద్దనే సంగీత సాహిత్యంబుల గరచినదట. శ్రీరామభక్తి తాత్పర్యమును వారివల్లనే నీయమకు సంక్రమించి యుండును. ఇందు మొదటి రెండింటిని శ్రీమాన్ కొమాండూరి వెంకటరామానుజాచార్యులుగారును, మూడవదానిని శ్రీ పండిత ఆకిలి శ్రీరామశర్మగారును పరిష్కరించిరి. వీరిలో ఆచార్యులుగారు సామాన్యులుగారు. ఈ శతాబ్దారంభమున వీరి సంపాదకత్వమున వెల్వడిన "వాగ్వల్లి" కీ. శే. వే. వెంకటరాయ శాస్త్రిగారివంటి కవికుంజరమునే కాలాడకుండ కట్టివైచినది. రెండవారును పండితులు, కవులు, మంత్రశాస్త్రవిదులు, ఆయుర్వేద వైద్యులు. వీరుభయులకు నీకావ్యములు పరిష్కార యోగ్యములగుటయే వీని గొప్పతనము చాటెడిని. కవిత్వసంపదయు తల్లిగారి రచనల నన్నివిధముల పోలియున్నది. వీరితల్లిగారు భక్తిభావము నవలంబించుట న్యాయము. ఇక్కాలపు నారీమణులును తమరచనలకు భక్తిని ముఖ్యవస్తువుగా గైకొనుట అరుదు. వీరిరువురి శతకములు కేవలము భక్తిపూరితములేగాని - వేణుగోపాలశతకాదులవలె లోకవృత్త విమర్శకములు గావు. ఈతల్లి కూతుండ్రగూర్చి, సుప్రసిద్ధ పండితులు, విమర్శకులునగు పెద్దలొకరు వ్రాసినదానిని వచ్చేసంచికలో ప్రకటింతుము. నెల్లూరునకు వారికివ్రాసిన రాగలవు.

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.